# వ్యాసజ్యోత్స్న

## వ్యాస సంపుటి

డా॥ ఎస్. శరత్‌జ్యోత్స్నారాణి

VYASAJYOTHSNA
(Vyasa Samputi)
**Dr. S. Sarat Jyothsna Rani**
Reader, Dept. of Telugu
University of Hyderabad
Central University P.O. 500 046
A.P.



| | | |
|---|---|---|
| Copies | : | 500 |
| Published | : | January 2002 |
| Price | : | Rs. **60/-** |
| Cover Design | : | **Sri Chidambaram** |
| For Copies | : | **Visalandra Publishing House**<br>All Branches<br><br>**Navodaya Book House**<br>Opp. Arya Samaj Street<br>Kachiguda, Hyderabad. |
| Published by | : | **V.V. Ramana**<br>Sri Sai Krupa Aprtments<br>Flat No. 101<br>Ram Nagar Gundu<br>Vidyanagar<br>Hyderabad<br>Phone : 040 - 7075017 |
| Composed & Printed at | : | **Sri Sai Shamili Graphics**<br>Golnaka, Hyderabad.<br>Ph. 040- 7561442 |

# అంకితం



నిత్య చైతన్య శీలి

బహుముఖ ప్రజ్ఞాశాలి

నిరంతర పరిశోధనా మూర్తి

కవితా వ్యాసంగ స్ఫూర్తి

హృదయనేత్రి

డా॥ వాసా ప్రభావతి గారికి

ఆత్మీయంగా

ఈ'వ్యాస జ్యోత్స్న'ను అంకితమిస్తున్నాను.

- శరత్ జ్యోత్స్నారాణి

# కృతజ్ఞతలు

నా వ్యాసాల పరంపరలో 'వ్యాసజ్యోత్స్న' రెండవ సంపుటి. ఈ సంపుటిలో వివిధ అంశాలపై వివిధ సందర్భాలలో రాసిన వ్యాసాలున్నాయి. మరికొన్ని వ్యాసాలు వాఙ్మయి, విశాలాంధ్ర, ఆంధ్రభూమి, ఢిల్లీ తెలుగు వాణి వంటి సుప్రసిద్ధ పత్రికలలో ప్రచురింపబడినవే.

వ్యాసాలకు వ్యాసజ్యోత్స్న అనే పేరు పెట్టడానికి ఒక కారణం ఉంది. తియ్యని మన తెలుగుభాష గొప్పతనాన్ని చాటిచెప్తున్న కవుల రచనలను, వానిలో నిక్షిప్తమై ఉన్న వస్తురూప, శిల్పసౌందర్యాలను వ్యాసాల రూపంలో చెప్పడం జరిగింది. కవితయినా, వ్యాసమైనా, కథఅయినా, నవలయినా పాఠకుల మనస్సుల్లో వెన్నెలలను కురిపిస్తాయి. ఆ భావంతో ఈ నా వ్యాస సంపుటి 'వ్యాసజ్యోత్స్న'గా మిగలాలని ఈ పేరు పెట్టాను.

'వెన్నెలలాంటి వ్యాసాలు' అనే శీర్షికతో వ్యాస వైవిధ్యాన్ని వివరించి నిండు గుండెతో ఎప్పుడూ నన్ను ఆశీర్వదిస్తున్న ఆత్మీయ గురువులు, సుప్రసిద్ధ విమర్శకాగ్రేసరులు ఆచార్య జీ.వి.సుబ్రహ్మణ్యం గార్కి కృతజ్ఞతాంజలులు తెలియజేస్తున్నాను.

ఆయన శిష్యురాలిని కాకపోయిన ఆయనతోగల ఆత్మీయ పరిచయాన్ని వారు నాపట్ల చూపిస్తున్న అవ్యాజమైన ప్రేమ నన్ను ఆయన శిష్యువర్గంలోకి చేర్చిందనే చెప్పాలి. ఈ వ్యాస సంపుటికి శుభాకాంక్షలు అందించిన ఆచార్య ఎస్వీ. రామారావు గార్కి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

వ్యాసజ్యోత్స్నకు 'అభినందన' అందజేసిన గురువర్యులు ఆచార్య బేతవోలు రామబ్రహ్మం గార్కి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ నా వ్యాసజ్యోత్స్నను స్వీకరిస్తున్న ప్రముఖ కవయిత్రి, రచయిత్రి మనస్విని డా॥ వాసా ప్రభావతి గార్కి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

నా ఈ రచన వెలుగులోకి రావడానికి ఎంతగానో సహకరించిన చిరంజీవి దార్లకు, వి.వి. రమణ గార్కి,

అందంగా ముఖచిత్రాన్ని అందించిన శ్రీ చిదంబరం గారికి, వ్యాసాలను కంపోజ్ చేసి ప్రచురించిన శ్రీ సాయి శామిలి గ్రాఫిక్స్ రవి కుమార్ గారికి, కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

- శరత్ జ్యోత్స్నా రాణి

# వ్యాస సూచిక

***Dr. Vasa Prabhavathi*** M.A., Ph.D.
Poetess, Writer & Critic
Reader & Head Dept. of Telugu (Retd.)
S.N.Vanitha Mahavidyalaya
Hyderabad.

# స్వీకృతి

## సాహితీ జ్యోత్స్నలు

ఆధునిక సాహిత్యంలో వచనం ప్రత్యేక స్థానాన్ని సంతరించుకుంది. నవల, కథతో పాటు వ్యాసానికి మరింత ఆకర్షణ పెరిగింది. దిన, వార, పక్ష, మాస, త్రైమాసిక పత్రికలలో వ్యాసానికే పెద్ద పీట వేస్తున్నారు. రాజకీయ, సాంఘిక, హాస్య, వ్యంగ్య వ్యాసాలతో పాటు సాహితీ వ్యాసాలకు మరింత ఆకర్షణ పెరిగింది సూటి విషయ విపులీకరణతోపాటు, చక్కని, చిక్కని శైలి పాఠకలోకానికి మరింత ఆకర్షణ. అందుకే వచన ప్రక్రియలో వ్యాసం పెద్దపీట వేసుకుంది.

డా॥ శరత్ జ్యోత్స్నారాణి సెంట్రల్ యూనివర్సిటీలో తెలుగు అధ్యాపకురాలు. కవిత, కథలతో పాటు వ్యాసరచనలో మరింత నేర్పరి. 14 సాహితీ వ్యాసాలతో 'వ్యాసజ్యోత్స్న' సంపుటి ప్రచురిస్తున్నారు. కొన్ని వ్యాసాలు పత్రికలలో ప్రచురించబడితే మరికొన్ని సెమినార్లలో చదివిన వ్యాసాలు, రావిశాస్త్రి కథలు, గిడుగు ఆంధ్రోద్యమం, స్త్రీవాదేతర కవిత్వం, బాపురెడ్డి 'కాలం మాయాజాలం-తాత్త్విక చింతన', 'మామాస్టారు జీ.వి.యస్.' వ్యాసకర్తగా ఎస్.వి. రామారావుగారు మొదలైన వ్యాసాలు సాహితీ జ్యోత్స్నలు వెదజల్లుతూ సాహితీవేత్తల మన్నలను అందుకున్నవే. అత్యంతా భిమానంతో ఈ వ్యాస జ్యోత్స్నను నాకు అంకితం చేస్తున్నందుకు రచయిత్రి జ్యోత్స్నారాణిని మనసారా అభినందిస్తున్నాను. సాహితీ జగత్తులో మరింత ఉన్నత స్థితికి ఎదగాలని మనసారా కోరుకుంటున్నాను.

ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం
రిటైర్డ్ ప్రొఫెసర్, తెలుగుశాఖ
యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్.

# వెన్నెల లాంటి వ్యాసాలు

విశ్వవిద్యాలయంలో పనిచేసే ఏ అధ్యాపకుడైనా వ్యాస సంకలనం వెలువరిస్తే మొదట ఎవరైనా అడిగేప్రశ్న-ఇవి సెమినార్ వ్యాసాలా? అని అడిగేవాళ్ళ దృక్పథాన్ని బట్టి ఆ ప్రశ్నకు అనేక అర్థాలు చెప్పే అవకాశమున్నా -అందరూ 'సెమినార్‌వ్యాస'మంటే ఒక ప్రత్యేక తరహా వ్యాసంగా గుర్తిస్తున్నా రన్నది వాస్తవం సమీక్షావ్యాసం, పత్రికావ్యాసం, రేడియో ప్రసంగం, పరిచయ వ్యాసం, చిరువ్యాసం, మినీవ్యాసం, కాలం వ్యాసం, వార్తావ్యాసం, వ్యంగ్య చిత్రవ్యాసం, ఇలా ఎన్నో వ్యాస ప్రక్రియలు వినిపిస్తున్న కనిపిస్తున్న రోజుల్లో వీటిమధ్య సెమినార్ వ్యాసం కూడా ఒక ప్రత్యేకత సంతరించుకొన్నది. సెమినార్‌లో చదివిన (సమర్పించిన) వ్యాసం కాబట్టి దానికా పేరు వచ్చింది. పత్రికలలో ప్రచురించబడినది కాబట్టి పత్రికావ్యాసం - ఇలా ఆపదాలకు అర్థం చెప్పుకోవచ్చు. అయితే వీటికి స్థిరమైన నిర్వచనాలు గానీ, స్వరూప స్వభావాలు గానీ చెప్పడం కష్టం. ఎందుకంటే 'సెమినార్' 'పత్రిక' అనే వ్యవస్థల స్వభావాలు కాలానుగుణంగా మారుతూ ఉంటాయి. కాబట్టి వాటిలోకి సంబంధించిన వ్యాసాలు కూడా అర్థాలు మార్చుకుంటాయి.

పదేళ్ళక్రితం 'సెమినార్' అంటే ఉండే భావన ఈనాడు లేదు. అప్పుడు పరిశోధన వ్యాసం చదువుకునేది, సెమినార్ వ్యాసం వినేది అనే భావం ఉండేది. ఇప్పుడా అర్థంలో లేదు. పూర్వం కొత్త సంగతి చెప్పటానికే సెమినార్ వ్యాసం ఇప్పుడు కొత్తగా చెప్పటానికే సెమినార్ వ్యాసం. అప్పుడు కొత్త సామగ్రి కోసం, కొత్త సమన్వయం కోసం సెమినార్ వ్యాసం. ఇప్పుడు కొత్త వివేచన కోసం, విశ్లేషణ కోసం, వివరణ కోసం సెమినార్ వ్యాసం.

అసలు సెమినార్‌లో ఒక అంశంమీద ఉపన్యసించటమే ఒకకళ. ఉపన్యాసం అనగానే విషయంమీద నిలబడి మాట్లాడటం చాలామందిలో తక్కువ. విశ్వవిద్యాలయ ఉపాధ్యాయులకు శాఖా చంక్రమణం తరగతి గది ఉపన్యాసాల్లో అంతమంచిది కాదు. సాధారణోపన్యాసాలతో అదే సాధారణం. సెమినార్ ఉపన్యాసాలు తరగతి ఉపన్యాసాల కంటె భిన్నంగా ఉండాలి మరి.

అయితే అవి సాధారణోపన్యాసాలు కాకూడదు. అందువలన సెమినార్లలో ఉపన్యాసాలు మాని పత్రాలు చదువమనటం పరిపాటి అయింది. చరిత్ర అంతటితో ఆగలేదు. పత్రాలు వినటానికి పసందుగా ఉండాలి. లేకపోతే పత్రపఠనం శ్రోతలను ఆకట్టుకోదు. పత్రసమర్పణకు అందరూ పరిశోధకులైతే బరువైన వ్యాసాలు తెస్తారు. బరువుగా చదువుతారు. వినేవారు బరువుగా వింటారు. కొన్నాళ్ళు ఈ బరువుమీద బరువైన చర్చలు జరిగాయి. చాలమంది బరువును దించటానికే పూనుకున్నారు. మరి సెమినార్ ఎందుకు? అనే ప్రశ్నలోని లక్ష్యం మారింది. చెప్పేదేదో తెలిసేటట్లు, తెలిసేదేదో తేటపడేటట్లు, మాట్లాడుతున్నట్లు, సూటిగా చెపుతూ అందరికీ అర్థమయ్యేటట్లూ చెప్పేదే సెమినార్ వ్యాసం. ఆ వ్యాసం ఒకసారి వింటే అందులో సంగతి తెలిసిపోవాలి. తిరిగి తిరిగి చదవటం కాని, వినటం కాని, ఉండకూడదు. సెమినర్ వ్యాసాలు బాగా తెలిసినవారు వినటానికి కాదు, సామాన్యులకూ, పరీక్షలకు పోయేవారికీ, విద్యార్థులకూ, సాహిత్యాభిమా నులకూ ఆసక్తి కలిగించేటట్లు వ్రాసేవిగా ఈనాడు భావింప బడుతున్నాయి. వేలకొలది రూపాయలు ఖర్చుపెట్టి సెమినార్ జరుపుతుంటారు కొందరు. వేళ్ళమీద లెక్కించదగినవారే వింటుంటారు. ఈ విపరీతానికి కళ్ళు మూసుకొంటాం. ఆ వ్యాసం ప్రచురితమౌతుంది చదువు కోవచ్చునని సరిపుచ్చుకుంటాం. ఒక్కోసారి పత్రిక సమర్పకులు ఎక్కువగా ఉంటే సెమినార్ వ్యాసాన్ని సారాంశంతోనే ఏదో పదినిమిషాల్లో ముగించేస్తారు. ఇలా ఎన్ని ఇబ్బందుల నెదుర్కొంటున్నా సెమినార్వ్యాసం చదువులగుళ్ళలో సరదాగా జీవితం సాగిస్తూనే ఉంది.

సెమినార్ వ్యాసం ఒకప్పుడు పరిశోధన వ్యాసానికి ప్రాణస్నేహితురాలు. ఇప్పుడు పత్రికా వ్యాసానికి పరమ మిత్రురాలు. అందువలన పత్రికావ్యాస స్వభావాన్ని ప్రధానంగా తనలో జీర్ణించుకోవటం కనబడుతుంది. దీనికి తెలుగు పరిశోధన వాతావరణంకూడా కొంత తోడ్పడింది. పరిశోధన పత్రికలు తెలుగులో కనుమరుగైపోయాయి. పత్రికలే వ్యాసాలను చాలావరకు పోషిస్తున్నాయి. వాటి లక్ష్యాలన్నీ సాహిత్య ప్రమాణాలమీదనే ఉండక పోవచ్చును. ప్రచార ప్రమాణాలలో పరిశోధన ప్రసంగాలను ఆధునిక సాంకేతిక శాస్త్రం ధోరణుల్లో వ్యక్తీకరించటం పత్రికా వ్యాస స్వభావం అవి కూడా చదవటానికి పనికి వచ్చేవిగానే ఉంటున్నాయి. సెమినార్ వ్యాసం ముఖ్యంగా వినటానికి, ఆ తరువాత చదువుకోటానికీ ఉద్దేశించబడ్డాయి. విషయగాఢతకంటె ప్రసారత ప్రధానంగా సాగుతున్నాయి. సోదరి డా॥ శరత్ జ్యోత్స్నారాణిగారి వ్యాసాలు చదవంగానే నేటి సెమినార్ వ్యాసాల విన్యాసాలు జ్ఞాపకం వచ్చాయి.

నేటి సెమినార్ వ్యాసం అవధాని కవిత్వం లాంటిది. ప్రశ్నకు ఇచ్చిన అంశం మీద అవధాని కవిత్వం చెప్పాలే కాని అంశాన్ని ఎన్నుకొనే అవకాశం ఆయనకుండదు. అయితే, అప్పుడప్పుడు అవధానికిష్టమైన అంశం కూడా పృచ్ఛకు డడగవచ్చు. అట్లాగే సెమినార్‌లో ఇచ్చిన అంశం మీదనే వ్యాసకర్త వ్యాసం రాయాలి. అవి వ్యాసకర్త అభిమానాంశాలు కావటం కవితత్వం. అయితే విశ్వవిద్యాలయ అధ్యాపకులు ఐ.ఏ.ఎస్. ఆఫీసర్లలాగా ఏ అంశం మీదనైనా మాట్లాడే నేర్పరితనం, విజ్ఞానం సంతరించుకొని ఉండాలి. సాహిత్యంశాలన్నింటిని గురించిన సామాన్యజ్ఞానం ఉండటం సాహిత్యా చార్యులకు అవసరం కాబట్టి ఇచ్చిన అంశం మీద మెచ్చుకొనేటట్లు మాట్లాడడం వారికి సహజం. సోదరి డా॥ శరత్ జ్యోత్స్నారాణి గారు వైవిధ్యంతో కూడిన అంశాలమీద వైదుష్యంతో వ్యాసాలు రాయగలిగారు.

డా॥ శరత్‌జ్యోత్స్నారాణి గారి తండ్రి 'పద్మశ్రీ' 'కళాప్రపూర్ణ' డా॥ ఎస్.టి. జ్ఞానానందకవి గారు నాకు మిత్రులు. అందువలన ఈ రచయిత్రి ఆత్మీయ వర్గంలో చేరుతుంది. నాకు వీరిద్దరంటే అవ్యక్తమైన అభిమానం. ఎందుకంటే వారిపేర్లు ఆధ్యాత్మిక భావనకు ఆలంబనలౌతాయి ఒకరు జ్ఞానానంద వాచ్యులు. జ్ఞానం తెలివిడిగా ఉన్నంత కాలం సూర్యరశ్మి, అనుభవంగా మారినప్పుడు చంద్రరశ్మి, తండ్రి సూర్యరశ్మి, కూతురు చంద్రరశ్మి (శరత్ జ్యోత్స్న) వారిద్దరిలో ఈ తేడా కూడా ఉంది. తండ్రి గారు అనుభవాన్ని ఓజస్సుగా మార్చి పద్యం రాస్తారు. కూతురు అనుభవాన్ని వెన్నెలగా వచనం లోనూ, వచన కవిత్వంలోనూ జాలువారుస్తుంది తండ్రి ఒక తరం నమూనా. కూతురు ఈతరం నమూనా!

వెన్నెల కురుస్తుంటే కన్నుల పండువుగా ఉంటుంది. వెన్నెట్లో తిరుగుతుంటే వేడుకగా ఉంటుంది. వెన్నెల పడ్డంత వరకు వస్తువులు కనపడుతుంటాయి. వెన్నెలలో తెలుపు తప్ప నలుపుండదు. అనుభవానికి మారుపేరు అచ్ఛమైన వెన్నెల. వెన్నెల సన్నగా మాట్లాడుతుంది. సంతోషంగా మాట్లాడుతుంది. సరళంగా సాగుతుంది. వెన్నెల వ్యాసం రాస్తే వ్యాసజ్యోత్స్న అవుతుంది. వెన్నెలను గురించి విశ్లేషించటం కంటే వెన్నెట్లో తిరగటమే మంచిది. అందువలన వెన్నెలలాంటి వ్యాసాలను గురించి అధిక ప్రసంగం చేసి పఠితలకు అడ్డం నిలువదలచుకోలేదు.

మా మాస్టారు జీవియస్ అని వ్యాసం రాశారు డా॥ శరత్ జ్యోత్స్నారాణి గారు. ఆనాడు వెన్నెట్లో చుక్కలశాలువా కప్పారు. ఈనాడు పీఠికమీద కూర్చోబెట్టి పండిత తాంబూలమిచ్చారు. శుభం భూయాత్!

-జి.వి. సుబ్రహ్మణ్యం

ఆచార్య ఎస్వీ రామారావు
డీన్, ఫ్యాకల్టీ ఆఫ్ ఆర్ట్స్, (రిటైర్డ్)
ఉస్మానియా యూనివర్సిటీ
హైద్రాబాద్.

# శుభాకాంక్షలు

ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో శరత్‌జ్యోత్స్నారాణి పిహెచ్.డి చేస్తున్న సందర్భంలో ఆమె పరిచయం కలిగింది. ఆమె సాహిత్యాభిలాషను గమనించి ప్రోత్సాహవాక్యాలు పలుకుతూ వుండేవాణ్ణి. ఇవాళ అధ్యాపకురాలిగానే కాక - వక్తగా, వ్యాసకర్తగా, కవయిత్రిగా, కథా రచయిత్రిగా రాణించటం చూచి ఎంతో ఆనందిస్తున్నాను. జ్యోత్స్నాకళాపీఠం నెలకొల్పి పలు సాహిత్య కార్యక్రమాలు నిర్వహిస్తున్నందుకు ఆమెను అభినందిస్తున్నాను.

సృజనాత్మక రంగంలో అడుగిడి ఆమె కథలు, కవితలు వెలువరించారు. 'నీకూ నాకూ నడుమ' ప్రచురితమైన ఆమె కథా సంపుటి. కవితా ప్రక్రియలో 'కొత్తపాట'ను వినిపించిన శరత్‌జ్యోత్స్న వివిధ కవుల పద్యాలను సంకలించి (సాహితీ మూర్తుల ప్రశస్తి) కొత్తబాటను వేశారు.

సాహితీ వారసత్వంగా స్వతః ఆమెలో ఏర్పడిన పరిశోధనాసక్తి, విశ్లేషణా శక్తి వివేచనాత్మక రంగంలో కూడా ఆమెకు స్థానాన్ని గడించాయి. డా॥ ఎస్.టి. జ్ఞానానందకవి రచనలపై, ఎల్లోరా రచనలపై వెలువరించిన సిద్ధాంతవ్యాసాలు అందుకు తార్కాణాలు. ఆమె పరిశోధనా జిజ్ఞాస కేవలం విశ్వవిద్యాలయ డిగ్రీలకే పరిమితం కాలేదు. అభినివేశంలో వివిధ సదస్సుల్లో పత్రాలు సమర్పించారు. ఉత్సాహంతో పత్రికల్లో వ్యాసాలు ప్రచురించారు. అవన్నీ సంకలించి తొలుత 'సాహితీ సౌరభం' వెదజల్లారు. ఇప్పుడు 'వ్యాస జ్యోత్స్న'ను ప్రసరింపజేస్తున్నారు. ఈ సంపుటిలోని పద్నాలుగు వ్యాసాలు శరత్‌జ్యోత్స్న సూక్ష్మపరిశీలనకు, విస్పష్ట విశ్లేషణకు, నూత్నాంశవివేచనకు నిదర్శనాలు.

ఈనాడు సాహిత్యరంగంలో ప్రచలితమైవున్న వాదాలను ఆసక్తితో గమనిస్తున్న జిజ్ఞాసువు జ్యోత్స్నారాణి. ఆ వాదాల నిగ్గులను ఇందలి వ్యాసాలలో ఎత్తి చూపారు. స్త్రీల జీవితాల్లోని చీకటి కోణాలను వెలుగులోకి తెచ్చిన కవయిత్రులను చక్కగా పరిచయం చేస్తుంది ఒక వ్యాసం. స్త్రీ వాదంతో నిమిత్తం లేని కవయిత్రుల రచనలను కూడా వివేచిస్తుంది మరొక వ్యాసం. అంతేకాక

జాషువా ఖండకావ్యాల్లోని స్త్రీ జనోద్ధరణా దృక్పథాన్నీ, జానపద కథల్లో వివిధ రూపాల్లో గోచరించే స్త్రీమూర్తి చిత్రణనూ పరామర్శించేవి కూడా వున్నాయి.

అట్టడుగు ప్రజల గోడును బలంగా వినిపిస్తున్న దళితవాదం నవలా సాహిత్యంలో ఎలా ప్రతిబింబిస్తున్నదో, వర్తమాన జగత్తులో ప్రవర్తిల్లుతున్న ప్రపంచీకరణ ప్రభావానికి తెలుగు కవులు ఏ విధంగా స్పందిస్తున్నారో వివరించే వ్యాసాలు ఈ రచయిత్రి సామాజిక స్పృహను చాటుతాయి. ప్రక్రియలతోపాటు ప్రత్యేక కవి పరామర్శలు కూడా ఈ సంపుటిలో చోటు చేసుకొన్నాయి. సి.నా.రె. 'మట్టి మనిషి ఆకాశం' వెల్లివిరిసే మానవుని అన్వేషణా చైతన్యం, బాపురెడ్డి 'కాలం మాయాజాలం' లో వ్యాఖ్యాతమైన కాలతత్త్వం నిరూపించే వ్యాసాలు పేర్కొనదగినవి.

రాబోయే రచనలు, బతుకమ్మ పాటలు - సామాజికాంశాలు, 'స్వాతంత్ర్యానంతర కవిత్వం - వస్తురూపశిల్పాలు' నూత్నాంశ వివేచనకు దారితీస్తాయని ఆశిస్తూ, రచయిత్రి శరత్‌జ్యోత్స్నారాణికి నా శుభాకాంక్షలు.

- డా॥ ఎస్వీ.రామారావు

ఆచార్య బేతవోలు రామబ్రహ్మం
డీన్, సాహిత్యపీఠం
తెలుగు విశ్వవిద్యాలయం
రాజమండ్రి.

# అభినందన

ఉద్యోగంలో స్థిరపడగానే కలం మూసేసేవారే ఎక్కువమంది. కానీ ఈ అమ్మాయి అలా కాదు. ఎప్పుడూ ఏదో ఒకటి శక్తిమేరకు రాస్తూనే ఉంది. పోటీలో అలా నిలబడుతూనేఉంది. సృజన-విమర్శన-పరిశోధనలను ముప్పేటగా నడిపిస్తోంది. వీళ్ళ నాన్నగారు ఇప్పటికీ కలం దించని కవి. అలాగే ఈ అమ్మాయి కూడా సాహితీ వ్యాసంగాన్ని నిరంతరం కొనసాగించాలని ఆశిస్తూ అభినంది స్తున్నాను.

ప్రస్తుతం ఇది వ్యాస సంపుటి అన్నింటికీ అద్భుతంగా అతికే సొంతపేరు ఉండటంకూడా ఒక అదృష్టమే. వ్యాసజ్యోత్స్న అని చక్కటి పేరు ఇమిడింది. ఇందులో పధ్నాలుగు వ్యాసాలున్నాయి. వీటిలో రెండు వాఙ్మయిలో ప్రచురిత మయ్యాయి. నిజం చెప్పమంటే నాకు బాగా నచ్చిన వ్యాసాలు ఇవి. అన్ని వ్యాసాల్లోనూ ఒక సమానధర్మం ఉంది. ఎక్కడా ఎవరితోనూ పేచీలకు దిగక పోవడం ఈ అమ్మాయి వ్యక్తిత్వం. బహుశ ఇదికూడా గురువుల ప్రభావమేనేమో! నాగార్జున విశ్వవిద్యాలయంలో ఈ అమ్మాయి చదువుకుంది. అప్పట్లో అక్కడి నుంచి అత్యధికంగా వ్యాసపరంపరలు కురిపించిన ఆచార్య ఎస్.గంగప్పగారు ఈవిడ గురువుల్లో ఒకరు. లోతులకు దిగి జగడాల్లో కూరుకుపోని నిగ్రహం బహుశ ఆ గురువర్యులనుంచి ఈ అమ్మాయి నేర్చుకుందేమోననుకుంటాను. ఏమైనా అభినందించదగిన అంశం.

ఇందులో రెండు షష్టిపూర్తుల వ్యాసాలు ఉన్నాయి. వారిద్దరూ ఈ అమ్మాయికి గురుస్థానీయులు. నామీదకూడా ఎప్పుడో వ్యాసం రాసేస్తుందేమోనని అనిపిస్తుంది. ఈ అమ్మాయిలో కనిపిస్తున్న గురుభక్తిని అభినందించకుండా ఉండలేక పోతున్నాను. బహుశ ఇప్పటికి తెలిసి ఉంటుంది పాఠకమహాశయులకు అమ్మాయి- అమ్మాయి అని నేను ఎందుకు అంటున్నానో. శిష్యురాలు కనక ఎంత ఎదిగినా గురువు కళ్ళకి అమ్మాయే. ఆ చనువుతో ఆ బాధ్యతతో ఈ రెండు ముక్కలు రాసి మనసారా అభినందిస్తున్నాను ఆనందిస్తున్నాను. వ్యాసాల్లో ఏమి

ఉన్నదో ఏమి లేదో చర్చించడం చర్చించకపోవడం - ఇవన్నీ చూసుకునేందుకు విమర్శకులు బోలెడుమంది ఉన్నారు. వారయితేనే ఆ పనిని నిష్పక్షపాతంగా చెయ్యగలుగుతారు. అందుకని కేవలం అభినందనతో సరిపెడుతున్నాను. శిష్యురాలి పక్షాన పాఠకమహాశయులకు ఈ సంపుటిలోకి సాదరంగా స్వాగతం పలుకుతున్నాను. సెలవు.

భవదీయుడు

**- బేతవోలు రామబ్రహ్మం**

# 'గిడుగు' ఆంధ్రోద్యమం

గిడుగు రామ్మూర్తి పంతులుగారి ఆంధ్రోద్యమాన్ని పరిశీలించేముందు 'ఉద్యమం' అంటే ఏమిటో తెలుసుకోవలసిన అవసరం ఉంది. అంతేకాదు, ఆనాటి ఆంధ్రోద్యమానికి ఊపిరి పోసుకుంటున్న కొన్ని ముఖ్యాంశాలను కూడా పేర్కొనవలసిన అవసరం ఉంది. 'ఉద్యమం' అంటే నిర్దిష్టలక్ష్యంతో క్రమబద్ధంగా చేసే కార్యకలాపాల సమాహారం అనీ, ఒక నిర్దిష్ట లక్ష్యాన్ని సాధించడంకోసం జనం సామాజికంగా చేసే ప్రయత్నం అనీ నిర్వచించవచ్చు. సామాజిక వ్యవస్థలో వేళ్ళూనుకునివున్న భావజాలాన్ని తిరస్కరిస్తూ దాన్ని మార్చడానికి చేసే సామాజిక ప్రయత్నమే ఉద్యమం అని అనవచ్చు.

ఉద్యమం ఒక లక్ష్యాన్ని సాధించడానికి జరిపే కృషి కాబట్టి ఆ కృషి వ్యక్తిపరంగా కావచ్చు, వ్యవస్థీకృతంగానైనా కావచ్చు. మొదట ఒక వ్యక్తితో ప్రారంభమైనా, తర్వాత దానిలో అనేకమంది భాగస్వామ్యం తోడవుతుంది నిర్దిష్టమైన లక్ష్యాన్ని సాధించాలని ప్రారంభించినా దానిని ఆధారం చేసుకొని మరికొన్ని ఉపలక్ష్యాలు కూడా నెరవేరుతూ ఉంటాయి.

మన భారతదేశంలో స్వాతంత్ర్యం సాధించుకోవటానికి సొంత వ్యక్తిత్వాన్ని కాపాడుకోవాలని, ఆత్మగౌరవం నిలబెట్టుకొని నిలబడాలనే లక్ష్యాలతో స్వాతంత్ర్యోద్యమం కొనసాగింది. 1857లో సిపాయిలలో కలిగిన ఆలోచన భారతీయ స్వాతంత్ర్య సంగ్రామానికి నాందీ గీతంగా చెప్పవచ్చు. కొంతమంది దాన్ని సిపాయిల తిరుగుబాటు అన్నారు. కాని సిపాయిలు తమ ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకోవాలనే లక్ష్యంతో పందికొవ్వు తూటాలను నోటితో కొరికి పేల్చాలనే ఆంగ్లేయుల చర్యను వ్యతిరేకించారు. అది 1947 నాటి స్వాతంత్ర్యం సాధించేవిధంగా అన్ని కోణాలనుంచి ఉద్యమాలు కొనసాగాయి.

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పటికీ కొన్ని సంస్థానాలను జమీందారులే పరిపాలించటం వల్ల ప్రజలకు బాధలనుండి విముక్తి లభించలేదు. దాని ఫలితంగానే తెలంగాణాలో ఉద్యమాలు చేయవలసి వచ్చింది. ఇదొక కోణంలో జరిగిందైతే మరో కోణంలో మన ఆంధ్రప్రదేశ్ ఒకనాటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఉండటం, ఆ తర్వాత 1956లో భాషా ప్రయుక్తరాష్ట్రాలు ఏర్పడేవరకూ తెలుగుభాషకు అనుకున్నంత గుర్తింపు లభించకపోవటం వల్ల మరలా ఉద్యమాలు కొనసాగించవలసి వచ్చింది. అప్పటి ఆంధ్రోద్యమ పరిస్థితులను గురించి పునఃపరిశీలిద్దాం.

ఆంధ్రోద్యమం :-

సాంస్కృతిక పునరుజ్జీవనంవల్ల ఆంధ్రులలో చైతన్యం కలిగింది. ఉత్సాహవంతులైన ఆంధ్ర యువకులు సాహితీసంస్థగా ఏర్పడి 1903-1904 సం॥లో దేశాభివృద్ధిని గురించి, దేశం ఎదుర్కొంటున్న సమస్యలను గురించి చర్చలు జరపడం ద్వారా ఆంధ్ర భాషాభిమానాన్ని చాటుకున్నారు. మరొకవైపు 1910 సం॥లో ఉన్నవ లక్ష్మీనారాయణ, చల్లా శేషగిరి రావు, జొన్నవిత్తుల గురునాథం ప్రభృతులు దేశంలోని రాష్ట్రాలు భాషా ప్రయుక్తంగా విభజించాలని, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కావాలని అభిప్రాయపడ్డారు. 1907 నాటికి ఈ ఆంధ్రోద్యమం బలపడి, బందరులో జరిగిన ఆంధ్రసభలో ఆంధ్రరాష్ట్రం నిర్మించాలనే తీర్మానానికి శ్రీకారం చుట్టబడింది. కళాశాలల్లో, విద్యాబోధన, శాసనసభల్లో కార్యకలాపాలు, కోర్టులలో న్యాయ విచారణ వంటివి మాతృభాషలోనే జరగాలన్నదే భాషా రాష్ట్రాల లక్ష్యం అని పట్టాభి ఆంధ్రరాష్ట్ర అవతరణ సంచికలో పేర్కొన్నారు.

1910లో ఏలూరులో, కృష్ణాజిల్లా మహాసభలో భాషా ప్రతిపదికగా, రాష్ట్ర విభజన జరగాలని ప్రముఖులు ప్రతిపాదించారు. 1913లో బాపట్లలో బయ్యా నరసింహేశ్వర శర్మ అధ్యక్షతన ప్రథమాంధ్ర మహాసభలు జరిగాయి.

న్యాపతి సుబ్బారావు, మోచర్ల రామచంద్రరావు, గుత్తి కేశవ పిళ్ళై, దేశపాండే సుబ్బారావు మొదలగువారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణవిషయంపై అంత సుముఖతను ప్రదర్శించలేదు. అయినా తెలుగు జిల్లాలకు ప్రత్యేక విశ్వవిద్యాలయం అవసరమని, కొత్త రైలు మార్గాలు వేయాలని, 1914లో రెండవ ఆంధ్రసభలో న్యాపతి సుబ్బారావు బెజవాడలో జరిగిన సభలో ప్రసంగించారు. తెలుగు జిల్లాలను ఒక రాష్ట్రంగా చేయటం సమంజసమని ఆ సభ తీర్మానించింది. ప్రత్యేక రాష్ట్రం కోసం సమితులను ఏర్పరచాలని తీర్మానించారు. 1915లో విశాఖపట్నంలో మూడవ ఆంధ్రసభను పానగల్లు రాజా రామాయణం అధ్యక్షతన జరిగింది.

1916లో కాకినాడలో నాల్గవ ఆంధ్రసభ మోచర్ల రామచంద్రరావు అధ్యక్షతన జరిగింది. 1917లో నెల్లూరులో జరిగిన ఐదవసభలో కొండా వెంకటప్పయ్య, కోడి రామమూర్తి ప్రసంగించారు. ఆ వూరి మున్సిపల్ ఛైర్మన్ ఆమంచర్ల సుబ్బుకృష్ణారావు స్థానికులు వ్యతిరేకించారు. 1918లో కడపలో ఆరవ సభకి నెమలి పట్టాభి రామారావు అధ్యక్షత. 7వ సభ గాడిచర్ల హరిసర్వోత్తమ రావు అధ్యక్షతన జరిగింది. 1920లో రంగనాధ మొదలియార్ అధ్యక్షత. 1921లోనే తెలంగాణా సభలు ఒకవైపు, గ్రంథాలయోద్యమం మరొకవైపు జరిగాయి. 1921లో కమిటీ నివేదికలు, థార్ (కమీషన్) కమిటీ నివేదిక, జె.వి.పి. కమిటి, ఆపైన ఆలీ కమిటి (1953), రాజధాని సరిహద్దు సమస్యలు, ఆపైన విశాలాంధ్ర సభలు జరిగాయి.

1956 నవంబరు 1వ తేది నాటికి ఆంధ్ర-తెలంగాణ నాయకుల మధ్య జరిగిన ఒప్పందం తర్వాత ఆంధ్రరాష్ట్ర అవతరణ సి.ఎమ్.త్రివేది గవర్నర్‌గా నీలం సంజీవరెడ్డి ముఖ్యమంత్రిగా మన భారత ప్రధాని నెహ్రూ ప్రారంభోత్సవంలో - జరిగింది. ఈ విధంగా ఆంధ్రోద్యమం `భాషవైపు` కేంద్రీకరించటంతో - ఒకే భాష, ఒకే సంస్కృతి, ఒకే చరిత్ర కలిగిన ఆంధ్రులంతా ఒకే విధంగా జీవించాలనే ఏకీకృత భావంతో ప్రత్యేక వ్యక్తిత్వాన్ని, చరిత్రను కాపాడుకోవాలనే ప్రయత్నంతో తమ ప్రాంతాలను తమ ప్రాంతం వారే పరిపాలించాలని భావించటం, తమ స్థానిక భాషలను అభివృద్ధిపరుచు కోవటం వంటి అంశాలపై దృష్టిని సారించి, తెలంగాణా, ఆంధ్రాలలో తమ తమ ప్రత్యేక వ్యక్తిత్వాలను కాపాడుకొంటూనే మరొకవైపు సమైక్యతకు కృషి చేయటం జరిగింది.

ఇవి రాజకీయంగా జరుగుతున్న ఉద్యమంలో జరిగే అంశాలు. మరొకవైపు గమనిస్తే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఒక్కసారిగా తెలుగు భాషావైభవం రాలేదు. దానికి ఎంతోమంది కృషి తోడయ్యింది.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడేవరకు ఆంధ్రప్రదేశ్‌లో ఉద్యమ సాహిత్యం ఎంతో స్ఫూర్తి నిచ్చింది. కవిత్వాన్ని కవులు ఉద్యమ ప్రచార సాధనంగా వాడుకోవడం మన శివకవుల కాలం నుంచి ఉందని చెప్పవచ్చు. ఆంధ్రుల గొప్పతనాన్ని, వారి శౌర్య పరాక్రమాల్ని, ప్రకృతి సంపదను, ఆంధ్రస్త్రీల ఔన్నత్యాన్ని తెలియజేస్తూ కవులు రాసిన రచనలు ఎన్నో ఆంధ్రోద్యమ కాలంలో వెలువడ్డాయి. రాయప్రోలు సుబ్బారావుగారి `ఆంధ్రావళి', విశ్వనాథ వారి ఆంధ్రప్రశస్తి, 'ఆంధ్రపౌరుషం', తుమ్మలవారి 'రాష్ట్రగానం', కొడాలి సుబ్బారావు 'హంపీక్షేత్రం', త్రిపురనేని సూతాశ్రమగీతాలు, గరిమెళ్ళ - మాకొద్దీ తెల్లదొర తనం, వేములపల్లి శ్రీకృష్ణ - చెయ్యెత్తి జై కొట్టు తెలుగోడా! వంటి కవితలు ఆంధ్రులను చైతన్యపరిచాయి.

"బ్రహ్మపురం మందేరా !
పర్లాకిమిడి మందేరా
కాదని వాదుకు వస్తే
కటకం దాకా మందేరా!"

అన్న త్రిపురనేని రామస్వామి చౌదరి కవిత మన రాష్ట్ర సరిహద్దులను తెలియ జేస్తుంది. మరొకవైపు పొట్టి శ్రీరాములు వంటి నాయకులు నిరాహారదీక్షలు, పర్లా కిమిడిలో గిడుగు రామమూర్తి గారి వ్యవహారిక భాషోద్యమం, దానిలో భాగంగా అనేక చోట్లకువెళ్ళి 'తెలుగుభాష' విశిష్టతను గురించి కృషి చేయటం మొదలైన అంశాలు ఎన్నో ఉన్నాయి. ఈ అంశాల్ని వివరించటంలోనే నెరపిన గిడుగువారి ఆంధ్రోద్యమం స్పష్టమవుతూ వుంది.

ఆనాటి పర్లాకిమిడి తెలుగు జిల్లాలు పట్నాలు అన్నింటిలోనూ, ఆధునిక జీవితాన్ని అనుభవిస్తూ విలాసవంతంగా పర్లాకిమిడి జమీందారులు సంతోషంగా గడిపేవారు. ఆనాటికే పర్లాకిమిడి జమీందారులు ఎలా ఉండేవారో తెలుసుకోవాలంటే ఆచార్య కాళ్ళకూరి సూర్యనారాయణగారు రాసిన శ్రీ గిడుగు రామమూర్తి పంతులు జీవితం గ్రంథాన్ని చూడవచ్చు. మొదట్లో ఆ సంస్థాన జమీందారు సంస్థానాన్ని పట్టించుకోకపోతే వాళ్ళ కుమారులు కోర్టు ఆఫ్ వార్డ్స్ వారు చెన్నపట్నం దొర తరపున సంస్థానాన్ని స్వాధీనం చేసుకొని బైలర్ దొరని తమ ప్రతినిధిగా నిర్ణయించుకున్నారు.

జమీందార్ల తరపున బైలర్ దొరగారే అధికారం చెలాయించేవారు. ఈ కాలంలోనే రామమూర్తి పంతులుగార్ని రాజ కుటుంబాలకు ప్రైవేట్ ట్యూటర్‌గా నియమించారు. దానితో రాజకుటుంబాలను బాగా దగ్గరగా పరిశీలించటానికి అవకాశం ఏర్పడింది. ఆనాటి రాజకుటుంబాల్లో రాజ్యాన్ని పరిపాలించే పురుషులు లేకపోవటం వల్ల, స్త్రీలు మాత్రమే రాజ వ్యవహారాలను జరపటం వంటి కారణాలవల్ల మగపిల్లలు మైనర్లు ఉండటంవల్ల అవగాహనలోపంతో అప్పటి ఓఢ్ర ప్రాంతంలో ఉన్న తెలుగువాళ్ళకు, ఒంఢ్రుం మాట్లాడేవారిమధ్య కొంత విభేదాలు రావటం, అవి తరువాత కాలంలో తీవ్ర స్థాయికి చేరటం జరిగింది. (గిడుగు రామమూర్తి పంతులు - పేజి 30).

గిడుగు ఆంధ్రోద్యమాన్ని మనం మూడు రకాలుగా పరిశీలించవచ్చు.

1. 1907 నుండి ఉద్యమం ప్రారంభించడం
2. 1911 నుండి ఉద్యమాన్ని ఉధృతం చేయడం
3. వ్యవహారిక భాషోద్యమం కోసం కృషి చేయడం

3.1 పూర్వకాలంలో కావ్యాలు తప్ప మిగిలిన టీకాలు, టిప్పణి, వ్యాఖ్యానం, శాసనాలు వ్యవహారికంలోనే ఉన్నాయని నిరూపించటం, వీటిని నిరూపిస్తూ గ్రంథాలను రాసేవారు.

3.2. చిన్నయసూరి వ్యాకరణాన్ని అనుసరించి మిగిలిన కవులు రాస్తున్నారని చెప్తున్నా అలా రాసేవారి కావ్యాల్లో ఉండే దోషాలను చూపడం -

3.3 వ్యవహారిక భాషోద్యమానికై కవుల్ని ఏకం చేయడం, ప్రభుత్వానికి మహజర్లు సమర్పించడం.

తాను సేకరించిన సాక్ష్యాధారాలనూ తాళపత్ర గ్రంథాలనూ వెంట తీసుకుని వెళ్ళి, రాష్ట్రంలోని ముఖ్య నగరాలు సందర్శించి, అక్కడ విద్యాలయాల్లోని పండితులనూ, ఇతర పండితులనూ, కలుసుకొని మన పూర్వులు వ్యవహారిక భాషను నిరసించలేదని సాక్ష్యాధారాలు చూపిస్తూ వారితో చర్చించేవారు.

చర్చానంతరం వారి అభిప్రాయాలను లిఖితపూర్వకంగా రాయించి, తీసుకునే వారు. అలా సేకరించిన వారి లిఖితపత్రాలను తాను పర్లామిడి నుంచి ఒక సంవత్సరం పాటు మాత్రమే నడిపిన 'తెలుగు పత్రిక'లో ప్రచురించేవారు.

1919వ సంవత్సరంలో ఆంధ్రభాషా పరిణామం గురించి 'తుదివిన్నపం'లో క్రమక్రమంగా తమవాదాన్ని ఆమోదించే వారి సంఖ్య అధికమవుతూ వచ్చిందనీ, పత్రికా సంపాదకులందరూ తమ పత్రికలందు వాడుక భాషలో రచించిన వ్యాసాలకు కొంచం కొంచెంగానైనా అవకాశం కలుగజేస్తున్నారని రాశారు.

1926వ సంవత్సరంలో తణుకులో ఆంధ్రసాహిత్య పరిషత్ సభలో అందరూ వ్యవహారిక భాషను అంగీకరించారు. ఈ విధమైన మార్పు రావడం వల్ల పరిషత్తు పెద్దలు ఉపద్రవం జరిగిపోయినట్లుగా భయపడి, అటుపైని జరిపే సాంవత్సరికోత్సవంలో తీర్మానాలు తమ పరిషత్తులో సభ్యులుగా జేరకుండా ఉండేటట్లు కట్టుదిట్టాలు చేసుకున్నారు. "నా వాదాన్ని పూర్తిగా మిత్రులు నవ్యసాహిత్య పరిషత్ స్థాపించి 'ప్రతిభ' అనే పత్రికలో ప్రకటిస్తున్నారు. ప్రభుత్వం, విశ్వవిద్యాలయాలలోని వారు వ్యవహారిక భాష ప్రయోజనాన్ని అంగీకరించేవరకు, నేను నా వాదాన్ని పూర్తిగా నెగ్గినదని భావించలేను" అన్నారు గిడుగువారు.

**పూర్వ కాలంలోని కావ్యాలు :** చిన్నయసూరి వ్యాకరణానికి అనుగుణంగా రచనలు చేస్తున్నామని చెప్పుకునే పండితులూ, కవులు కూడా ఆ భాష తమకు సహజమైంది కానందువల్ల ఎన్నెన్నో లక్షణ విరుద్ధమైన ప్రయోగాలు చేస్తున్నారని గిడుగు ఎత్తి చూపించారు.

తిరుపతి వెంకటకవులు 'రెండు బాసలకు మేమెకవీంద్రులమంచు, ప్రగల్భంగా చెప్పుకున్న పద్యాలలోనే ఆయన ఒక వ్యాకరణ దోషం చూపించారు దోసమటం చెరింగియును, దుందుడుకొప్పగ పెంచినారమీ మీసలు రెండు బాసలకు మేము కవీంద్రులమంచుతెల్పగా రోసము కల్గినన్ కవివరుల్ మము గెల్వుడు! గెల్చిరేని ఈ మీసలు తీసి మీ పద సమీపమునన్ తలవంచి మ్రొక్కమీ!" ఈ పద్యంలో 'కవివరులు మమ్ము గెల్వుడు' అని మధ్యమ పురుష క్రియవాడి గెల్చితిరేని అని, ఆ తరువాత కూడ మధ్యమ పురుష క్రియనే వాడటానికి బదులుగా 'గెల్చిరేని' అని ప్రథమ పురుష క్రియను వాడటం దోషం కాదా! అని ఆయన ప్రశ్నించారు తిరుపతి కవులతో బాటు ఆనాటి కొమ్ములు తిరిగిన పండితులైన వేదం వెంకటరాయ శాస్త్రి వంటి ఉద్దండుల రచనల్లోని వ్యాకరణ దోషాల్ని కూడా ఎత్తి చూపించారు.

*జనవ్యవహారంలో ఉండే భాష :-*

లోకంలో, అంతటా ఏ కాలంలో, ఏ భాష శిష్ట వ్యవహారంలో ఉంటుందో అదే దేశభాష అవుతుందని, దానిలోనే అందరూ చదువుకోవటానికి ఉపయోగించే పుస్తకాలు రాయటం సదాచారంగా ఉందనీ ఇంగ్లాండు మొదలగు దేశాల్లో నెలకొని ఉన్న ఆ సంప్రదాయం ప్రకారం శ్రీ గురజాడ వెంకట అప్పారావు పంతులుగారు నేను చేసిన ప్రయత్నాన్నే తోసిపారేశారు. ఆ తర్వాత ఆంధ్ర సాహిత్య పరిషత్తువాళ్లే కొంతమంది విద్వాంసుల్ని అన్ని పట్నాలకు పంపించి, ఈ బహిష్కారాన్ని చాటింపించి, ఊరూరా సభల్ని నిర్వహించి, ఆంధ్ర మహాజనులు అంగీకరించేటట్లు తీర్మానాలు చేయించారు. పదివేల సంతకాలతో ప్రజల పేరిట మహజర్ నామా ప్రభుత్వానికి అందజేశారు.

గ్రామ్య వాదులు - 4
గ్రాంథికవాదులు - 4 యూనివర్సిటీ వారి నిర్ణయం ప్రకారం సభ్యుల నియామకం
మధ్యస్థులు - 2

అయితే పలుకుబడిని ఉపయోగించుకొని మరో 4గురు గ్రాంథిక వాదుల్ని సభ్యులుగా చేర్చుకున్నారు.

*ఐదవ నవ్యసాహిత్య పరిషత్తులో ఉద్బోధ :-*

మనదేశంలో నూటికి తొంభైమంది నిరక్షరాస్యులు. మిగిలిన పదిమందిలోను సరి అయిన విద్యా గంధం లేదు. ఒక్కడైనా సరి అయిన విద్య గడించిన వాడున్నాడోలేడో అందుకు గవర్నమెంటు వారి విద్యా విధానం ఎంతవరకు తోడ్పడుతుందని, వారికి ఆ విద్య గుమస్తా చాకిరికి మాత్రమే తోడ్పడుతుంది. లిపిలేని కాలంలోను తర్వాత అచ్చు పుస్తకాలు రాని కాలంలోను నోటిమాట ద్వారా ఉపాధ్యాయుల ఉపన్యాసాల్లోనూ విజ్ఞానం విరివిగా వ్యాప్తమయ్యేది.

ఉదాహరణకి ఉపనిషత్తులు చూడండి. ఒకరు ప్రశ్నించడం - రెండోవారు సమాధానం చెప్పడం కన్పిస్తుంది.

వ్యవహారమంతా నోటిమాట మీదనే సాగేది. భావం స్పష్టంగా తెలియాలి అంటే భాష సుపరిచితంగా ఉండాలి. అందుకు ఉద్యమ కాలంలో వెలువడిన గ్రంథాలను గ్రాంథికభాషావాదులు రాశారు. వ్యవహారిక భాషావాదులు రాశారు.

1. గ్రాంథికవాదులు - ఏ డిఫెన్స్ ఆఫ్ లిటరరీ తెలుగు - జయంతి రామయ్య పంతులు కరపత్రం.

ఆధునిక వచన రచనా విమర్శనం - వావిలికొలను సుబ్బారావు

వ్యవహారిక భాషలో

1. విధిలేక వైద్యుడు - వేదం వెంకటాచలయ్య

2. బీజగణితము - పి.టి. శ్రీనివాస అయ్యంగారు

3. మెమొరాండమ్ ఆన్ మోడర్న్ తెలుగు - గిడుగు రామ్మూర్తి 1912 లో ప్రభుత్వానికి అందజేసిన పత్రం - 1913లో దాన్ని పుస్తక రూపంలో ప్రచురించారు.

4. నిజమైన సంప్రదాయం - గిడుగు, 1914

5. ఆంధ్రభాష - వఝుల చిన సీతారామశాస్త్రి - భాషను సమర్థిస్తూ రాసింది.

6. ప్రాదెనుగకమ్మ - తనకు గ్రాంథిక భాష రాదనే వారికి రామమూర్తిగారు అతి ప్రాచీనమైన తెలుగులో రాసిన రచన.

కళింగ దేశ చరిత్ర - గురజాడ అప్పారావు రచన. ఈ రచనను విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి ప్రచురించింది. గ్రాంథికభాషలో - విమర్శదర్శనం - బుజ్జా శేషగిరి రావు.

*జీవద్భాషను వాడటానికి స్వాతంత్ర్యం :-*

ఆధునికాంధ్ర భాషా విషయంలో శ్రీ జయంతి రామయ్య పంతులుగారు రాసిన అర్జీని ప్రజలు ఆమోదించడానికై ఏర్పాటు చేయబడిన సభలో వీరేశలింగం గారు - ఆధునికాంధ్ర భాషను గురించిన వినతి అన్న మా కరపత్రంలో మేమాయన అభిప్రాయాన్ని విమర్శించి ఆయనతో ఆ విషయం చర్చించాం.

శ్రీ వీరేశలింగం గారు అభిప్రాయాన్ని స్వీయచరిత్రలో రాసుకున్నారు. తెలుగు మారిందని. ఆధునిక వచన భాషా వసరాలను తీర్చడానికి నూతన వ్యాకరణాన్ని ఆవశ్యకంగా రాయవలసి ఉన్నదని బహిరంగంగా ప్రకటించారు. వంగదేశంలో మనకళ్ళముందే నూతన ప్రజా సాహిత్యావిర్భావాన్ని చూస్తున్నాం - పాతవి పట్టుకొని పాకులాడేవారు కొందరు.

పాతవైన కొద్ది - పరిచయం తక్కువ, గౌరవం ఎక్కువ. దూరమైన కొద్దీ దృష్టి సూక్ష్మం అవుతుంది.

ఉదాహరణకు రామాయణం కన్న, శాస్త్రము కన్న వేదం గొప్పది. శాస్త్రిగారికన్న అవధానులు గొప్పవారు. తెలుగు రామాయణం కన్న సంస్కృత రామాయణం చదివిన

పుణ్యమెక్కువ. రాను రాను భాషమారి వాడుకలేక ఎవరికి తెలియకుండా అయింది. ఆంధ్రశబ్దం పుట్టిన కాలంలో ద్రావిడ, ఆర్య అనే శబ్దాలకు ధాతువులుగా ఉండే పలుకులు కూడా పుట్టాయి. కాలం గడిచినకొలది ద్రావిడులు, ఆర్యులు ఏ రీతిగా నాగరికులు అయ్యారో అదేవిధంగా ఆంధ్రులు అనుభవంవల్ల అభివృద్ధి చెందారు.

ఆర్యులు మాటవారైతే ఆంధ్రులు వ్రాతవారు.

ఆంధ్ర శబ్దం ఐతరేయ బ్రాహ్మణ్యంలోనే కాదు ఈనాటి తెనుగుగా ప్రజల్లో ప్రతివారి నోటినుండి వెలువడుతుంది. ఆంధ్ర కుటుంబంలో పుట్టడం వల్ల సమర్థత అనుభవంవల్ల జ్ఞానం వల్ల ఆంధ్రులు గౌరవనీయులుగా గుర్తింపబడ్డారు.

జమీందారిలోని ఓడ్రులకును తెలుగువారికి వైరం ఏర్పడింది.

ఓడ్రులు ఆంధ్రులు / ఓడ్ర రాజులు ఆంధ్రరాజులు.

ఇంతలో ఒరిస్సా రాష్ట్ర నిర్మాణ కార్యక్రమం ప్రారంభమయింది. తాలూకాతో కూడా, పర్లాకిమిడిని ఒరిస్సాలో చేర్చటం సమంజసమని పర్లాకిమిడిలోని కొంతమంది ఓడ్రులు రాజావారికి విన్నవించుకొన్నారు. తెలుగువారు అధికంగా ఉన్నా - వారంతా రాజవారికి ఎదురు చెప్పడానికి సాహసించలేకపోయారు. ఎందుకంటే, వారందరూ రాజావారి ఆశ్రితులే.

రాజా వారి ఆశ్రమంలో లేని కొంతమంది తెలుగువారు మాత్రం రామమూర్తి గారి నాయకత్వంలో పర్లాకిమిడిని ఒరిస్సాలో చేర్చడానికి వీలులేదని అన్నారు. వీరంతా కలిసి యాంటీ ఎమాల్గమేషన్ పార్టీని స్థాపించారు. వెంటనే వీరు గవర్నర్ జనరల్‌కు ఈ విషయమై వినతి పత్రాలను సమర్పించారు.

పర్లాకిమిడి జమీందార్లు ఓడ్రులు కనుక వారి జమీందారీ ఒరిస్సా రాష్ట్రంలో చేరడం సమంజసమని రామమూర్తిగారి వినతి పత్రానికి ప్రతిగా ఒక మహజరును ఓడ్రులు ప్రభుత్వానికి పంపించారు. దానికి సమాధానంగా పర్లాకిమిడి రాజా వారు గంగవంశం వారని, గంగ వంశీయులు ఓడ్రులు కారని, అనంతవర్మచోడ గంగ తన రాజధానిని కటకానికి మార్చిననాటినుండే గంగ వంశీయులు ప్రాంతీయ భాష అయిన ఒరియాను అలవరచుకొన్నారని నిరూపిస్తూ, భాషను బట్టి జాతిని నిర్ణయించడం సమంజసం కాదని రామమూర్తి మరొక వినతి పత్రాన్ని ప్రభుత్వానికి పంపారు.

1931లో జరిగిన మ్యునిసిపాలిటీ ఎన్నికల్లో యాంటీ ఎమాల్గమేషన్ వారు ఓడిపోయారు. ఎన్నికలంటే తెలియని ఆ ప్రాంతంలో బహిరంగంగా జరిగిన ఎన్నికలలో ఎక్కువ మంది తెలుగువారే కౌన్సిల్ మెంబర్లుగా ఎన్నికవడం విశేషమే.

సవరలు ఆంధ్రులు కారు. ఓఢ్రులు కారు. అందువల్ల వాళ్ళను మీరు ఓఢ్రులతో ఎలా కలుపుతారు? మీకు అభ్యంతరం లేకపోతే ఆంధ్రుల జనసంఖ్యతో కలపండి. ఆంధ్రుల శాతం పెరుగుతుంది అని సమాధానం చెప్పిన రామమూర్తిగారి మాటను అందరూ అంగీకరించారు. పర్లాకిమిడి తాలూకాలో ఉన్న ఏ భాగాన్ని ఒరిస్సాలో చేర్చరాదన్న నిర్ణయానికి వచ్చారు.

చివరకు పర్లాకిమిడి రాజావారు తమ పరపతిని ఉపయోగించడం వల్ల గిడుగు వారి శ్రమ, కోరిక చివరకు తీరలేదు. పర్లాకిమిడిని ఒరిస్సాలో కలపడంతో వారు ఆ ప్రాంతంపై పెంచుకున్న మమకారాన్ని, ప్రేమను విడిచిపెట్టి ఆ ప్రాంతాన్ని విడిచి రాజమండ్రి చేరుకున్నారు.

"నాదు జాతి నా దేహము నాదుభాష
అను అహంకార దర్శనమందుమాంధ్ర" అన్న రాయప్రోలు మాటలను స్మరణకు తెచ్చుకోవాలి. ఆంధ్రులకోసం ఆంధ్రోద్యమాన్ని ఒకవైపు, మరొకవైపు వ్యవహారిక భాషోద్యమాన్ని నెరపిన ధీరుడు గిడుగు. నిరంతరం ఆంధ్రుల అభివృద్ధికి, వారి ఔన్నత్యం కోసం శ్రమించిన పదహారణాల ఆంధ్రకవిరాజు గిడుగు రామమూర్తి.

*- హెచ్.సి.యు తెలుగు డిపార్ట్‌మెంట్ సెమినార్‌లో సమర్పించిన పత్రం - 2000*



# జాషువా రచనలు - స్త్రీ జనోద్ధరణ

కందుకూరి వీరేశలింగం పంతులుగారి సంస్కరణోద్యమంతో సమాజంలో అతి హీనంగా చూపబడుతున్న స్త్రీల జీవితాలలో వెలుగురేఖలు ఉదయించాయని చెప్పవచ్చు. 1874కి ముందున్న చరిత్రను పరిశీలిస్తే సమాజంలో విరివిగా జరుగుతున్న అతిబాల్య వివాహాలు - బొడ్డుకోయని కూనకు - చివరకు కడుపులో నున్న బిడ్డకు కూడా వివాహ సంబంధాలు నిర్ణయించడం వంటి సాంఘిక దురాచారాల ఆగడాలకు అంతులేకుండా ఉండేది. ఇక వితంతువుల పరిస్థితిని వివరించడానికేముంది? గురజాడ కన్యాశుల్కం నాటకంలోని బుచ్చమ్మ పాత్రను గమనిస్తే కన్యాశుల్కానికి ఆశపడిన తల్లిదండ్రులు వృద్ధులకు తమ బిడ్డలను వివాహం చేయడానికి వెనుకాడలేదనే విషయం స్పష్టమవుతుంది. ''పైకమిచ్చిన వారికే బాలికలను గట్టిపెట్టుట యిది యేటికర్మ'' అని ఆక్రోశించిన కవులు మాత్రమే దురాచారాలను ఎలుగెత్తి చాటి వాటిని ఖండించారు. అటువంటి వారిలో వీరేశలింగం, రఘుపతి వెంకటరత్నం నాయుడు, గురజాడ, రాయప్రోలు, మంగిపూడి వెంకటశర్మ, భోగరాజు నారాయణమూర్తి, జాషువా, చలం ప్రభృతులు సంఘ సంస్కరణ దృష్టిలో స్త్రీల అభ్యుదయం కోసం రచనలు చేశారు. ముఖ్యంగా వీరేశలింగం పంతులుగారు తన రచనలతో పాటు, స్త్రీల సంక్షేమానికి 1874 లోనే 'వివేక వర్ధిని' మాస పత్రికను స్థాపించి ఎనలేని కృషి చేశారు. ఆయన

''తెలుగులో వచన ప్రబంధమును నేనే చేసితిని
మొదటి చరిత్రను నేనే రచించితిని
స్త్రీలకై మొదటి వచన పుస్తకాన్ని నేనే కావించితి''నన్నారు.

ఆనాటి సమాజంలో బ్యాల్యవివాహాలవల్ల ప్రాప్తించిన వైధవ్యంవల్ల ఒంటరిగా జీవితాంతం జీవించనక్కరలేదని, వితంతు స్త్రీలు తిరిగి వివాహం చేసుకోవచ్చునని భోగరాజు నారాయణమూర్తి వితంతు వివాహాలను సమర్థిస్తూ 'విధవ విలాపం'లో ''తెఱవకు ముద్దుముచ్చటలు దీరకమున్నె శిరోజముల్ తెగం గొఱుగుదురయ్య పాపమని గొంకరటయ్య పునర్వివాహముల్ జరుపుటధర్మమంచెవరి శాస్త్రమునన్ గలదయ్య! యిటు లయ్యెరె! విధవాంగనల్ జులక నైరిగదయ్య! పురాకృతంబునన్'' మంగిపూడి వెంకట శర్మ ''వనితలకు వైధవ్యం వలన అందమైన జీవితం చితికి ముక్కలయి పోతుందని'' ''బాల వితంతు విలాపం''లో-

పొత్తిళ్ళలోనున్న నెత్తురుకందుల
పెండ్లిండ్లు సేయ భావించునొకడు
పురుడు పోవకమున్నె బొట్టెలనమ్మంగ
బేరసారములు గావించునొకడు
కన్నులు తెఱవని కసుగాయలను గట్టి
పెట్టి వృద్ధులను సేవించు నొకడు
పాలైన విడువని పసికూనలనుగూర్చ
వెసరాయబారి రావించు నొకడు"

గాజులకు, పసుపు, కుంకుమలకు, వన్నె చీరలకు, పూలకు, పుణ్యకార్యాలకు నోచుకోని మ్రోడులా, అడవి గాచినవెన్నెలలా స్త్రీలబ్రతుకులు దుఃఖమయమవుతున్నాయని బాల్య వివాహాలను నిరసిస్తారు. మరొక కవితలో 1914లోనే రాసిన అబలా విలాపంలో-

"బాలుర కెట్టులో బాలల కట్టులే
యున్నత విద్యల నొసగుడయ్య
యువకుల కెట్టులో యువతుల కట్టులే
స్వేచ్ఛా ప్రదానంబు సేయరయ్య"

బాలబాలికల మధ్య తేడాలను తల్లిదండ్రులే చూపిస్తున్నారని, యువకులకిచ్చే స్వేచ్ఛనే స్త్రీలకు ఇవ్వాలని, ఆ వనితలను అణగ దొక్కేడి పద్ధతిని నిరసిస్తారు.

వ్యాస భారతం అరణ్యపర్వంలోని శ్లోకంలో స్త్రీలకు ఉండే లక్షణాలు చెప్పబడ్డాయి. అవి

"ధృతిః క్షమాదయాశౌచం
కారుణ్యం వాగనిష్ఠురా
మిత్రాణాం చానభిద్రోహం
సప్తైతాః సవింధః స్త్రియః"

ధృతి, సహనం, దయ, శుచిత్వం, కారుణ్యం, ప్రసన్నవాక్కు, మిత్రులపట్ల అనభిద్రోహమను ఏడుగుణాలు స్త్రీని సమున్నత స్థానంలో కూర్చోబెట్టాయని వ్యాసుని శ్లోకం వల్ల తెలుస్తుంది. ఈ గుణాలను సమాజానికి చాటిచెప్పడానికి రాయప్రోలు సుబ్బారావు సాహిత్యంలో స్త్రీకి ఉన్నత స్థానాన్ని కల్పించారు. వీరు రాసిన తృణకంకణం, స్నేహలతాదేవి, కష్టకమల, స్వప్నకుమారం, రూపనవనీతం మున్నగు కావ్యాలు అందుకు

సాక్ష్యాలు. వీరి కావ్యాలన్నీ నాయికా ప్రధానాలే. నాయికలు ధీరస్వాంతలే. విషమ పరిస్థితికి ఎదురీది నిలిచి పురుషునికే జ్ఞానోపదేశం చేయగల ధృతిమతులు వీరు ఈ విధంగా స్త్రీ సమారాధన తత్త్వానికి కూడా రాయప్రోలు వారే మొదటివారు 1928 సం॥లో గృహలక్ష్మి పత్రికను శ్రీ కేసరిగారు నడుపుతూ, స్త్రీల చైతన్యం కోసం కృషి చేశారు. ఆరోజుల్లో స్త్రీలు బయటకు వెళ్ళి విద్యనభ్యసించడానికి అవకాశం లేకపోయినా 4వ తరగతి వరకు చదువుకున్న కనుపర్తి వరలక్ష్మమ్మ రాసిన శారదలేఖలు 1928లో గృహలక్ష్మి పత్రికలో ధారావాహికంగా ప్రచురింపబడ్డాయి. ఆ శారదలేఖలు ఆనాటి బాల్యవివాహాల వల్ల స్త్రీలు అనుభవిస్తున్న దుర్భరస్థితిని చిత్రించాయి.

జాషువా తన రచనలలో సాంఘిక దురాచారాలను ఖండించి స్త్రీల స్థితిగతులను కళ్ళారా చూసి, దుఃఖించి, వారి శ్రేయస్సును కాంక్షించి, ఖండికల ద్వారా, కావ్యాలద్వారా స్త్రీజనాభ్యుదయాన్ని ఆశించారు.

మనుస్మృతిలో "యత్ర నార్యస్తుపూజ్యంతెరమంతీతత్రదేవతాః"

అన్నట్లు స్త్రీలు ఎచ్చట పూజింపబడతారో అచ్చట దేవతలు సంచరిస్తారన్న సూక్తులున్నప్పటికిని భారతదేశంలోని స్త్రీలకు సరియైన గౌరవం లభించలేదని, అన్యాయం జరిగిందని 'కొత్తలోకం'లో జాషువా-

స్త్రీ కంటెన్ బురుషుండు శ్రేష్ఠుండనుచున్ సిద్ధాంతమున్ జేసితా
టాకుల్ కంఠము లెత్తి స్త్రీ జగతి కన్యాయంబు గావించెనో
యేకాలంబున బుట్టినింటయివలెనే నాటి స్వాతంత్ర్యముల్
స్త్రీకి మారు సమాన గౌరవవిభూతిన్ గాంతకుంగూర్పుమా!

అని, అనాదిగా స్త్రీ తన సర్వస్వాన్ని త్యాగం చేసి, క్షమారూపిణిగా మూర్తిభవించిందని, సమాజ పురోగతికి యావజ్జీవితం పాటుపడుతున్న స్త్రీకి పురుషునితో సమానంగా గౌరవాన్ని ఇవ్వవలసిందని కోరుతారు.

బాల్య వివాహాల ఊబిలో కూరుకుపోయిన యువతి భర్తను కోల్పోయి వితంతువుగా మారిందని, అటువంటి వితంతువులకు నూతన జీవితాన్ని ప్రసాదించాలనే ఆలోచనలు లేకుండా, తండ్రులు కుమారులకు పెండ్లి చేస్తున్నారని, విధవలను వారి కర్మకు విడిచిపెడుతున్నారని అంటారు. పురుషునితోపాటు స్త్రీకి కూడా సమాన గౌరవం ఇవ్వాలని, పురుషాధిక్యతనుండి విడివడిన నాడే స్త్రీకి విముక్తి అని పోరాడిన కవివతంసుడు. స్త్రీని చెడు దృష్టితో చూచేవారంటే జాషువాకు అసహ్యం. స్త్రీలను చూచినచో మన్మథ భూతం పూనువానిని గురించి, మానవుడై పుట్టి తోటి మానవుని గుర్తుపట్టలేని మూఢుని గురించి జాషువా 'స్వయంవరం'లో-

మానవుడై యితండెదిరి మానవులంగని గుర్తుపట్టగా
లేని మూఢచిత్తుడు చలింపడు వీని మనస్సు, లోకమే
మైన, కృపారసంబు నడయాడని వీని కఠోరదృష్టిలో
బూనుచునుండు పంచశరభూతలేమల దర్శనంబునన్

వితంతువుగా మారిన యువతిని ఈ సమాజం బ్రతకనిస్తుందా? లేదే! సహగమనం పేరుతో చంపివేయాలన్న జాడ్యాన్ని జాషువా తీవ్రంగా ఖండిస్తూ 'గబ్బిలం' రెండవ భాగంలో -

'సహగమనాచార దహనదేవతలెన్ని
చిగురు కొమ్మల బూది చేసెనొక్కొ!' అంటారు.

'కాందిశీకుడు'లో సహగమనాన్ని ఖండిస్తూ జాషువా -

'చల్లారెనే మహా సతుల నాహుతి గొన్న
సహగమనాచార దహనకీల'

అని జుగుప్సను కలిగించే ఈ ఘాతుకాన్ని గురించి వివరిస్తూ, ఐదు సంవత్సరాల బాలికను 50 సం॥ల వృద్ధునికిచ్చి వివాహం చేయడానికి కారణం పేదరికం అని, ఆస్తులు నిలుపుకోవాలనే కోరికతో తల్లిదండ్రులు ఇలా ప్రవర్తిస్తున్నారని 'ఖండకావ్యం' మూడవ భాగంలో-

"పడుచు బిల్లల ముసలికి
ముడి బెట్టితి పసుపు గుంకుములకున్వెలియై
గడియించిన నా పాపమున్
వడువున నిపుడా యనాధ ప్రత్యక్షమగున్"

అన్నారు సంఘసంస్కర్తలు కొందరు, వితంతు పునర్వివాహం జరపడాన్ని చట్టబద్ధం చేశారని, వారు ప్రోత్సహించిన విధానం వల్ల స్త్రీలకు ఆనందం కలగాలని జాషువా 'స్వయంవరం'లో-

చచ్చిన ముండమోపి పతి చావక యుండిన గాజుమెట్టెతో
....మండు కాంతల యభాగ్యదశన్దలపోసి మానసం
బుచ్చలితంబుగా కరుణయున్న మహాత్ములు కొందటిప్పుడీ
యుచ్చు సడల్చి యిచ్చి రెటులో పునరూధ్వహనాధికారమున్"

అంటారు. ఆడపిల్ల పుట్టుకే ఒక అరిష్టంగా భావించి, పుట్టిన వెంటనే మంచం మీదనే ఆడ శిశువుల గొంతు నులిమి చంపే దురాచారాన్ని నిరసిస్తూ, గబ్బిలం రెండవ భాగంలో-

"మొక్కు బళ్ళ నెపాన చక్కని పసిపాప
లెందరు గంగలో నిమిడి రొక్కొ!" అన్నారు.

భారతదేశంలోని స్త్రీలు. భర్తలలోని లోపాలను మనస్సులోనే దాచుకొని మసలుకొను సతీధర్మం కలవారని, పతిదేవుని బలహీనతలను ప్రోత్సహించి, స్త్రీ ధర్మాన్ని నిర్వహించేవారని సుమతిదమయంతి వంటి ఆదర్శ నారీమణుల అడుగుజాడల్లో నడుస్తూ భర్తలు ఎంత అప్రయోజకులైనను అణిగిమడిగి ఉండటం వల్ల సతీత్వమును వారికి అంటగట్టి పురుషులు ప్రచారం చేస్తున్నారని. స్త్రీలు ప్రగతిశీల మార్గంలో పయనించడానికి సిద్ధంగా లేరని జాషువా అభిప్రాయం. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ 'బాపూజీ' కావ్యంలో-

"వ్రతములని నోములని బుద్ధిబలము నదిమి
బత్తి చెఱసాలలో నుంచి బంధిచేసి
సతుల నైసర్గిక జ్ఞాన సస్యరమను
చిత్ర చిత్రముగా హత్య జేసినారు"అంటారు.

చిత్ర విచిత్రంగా స్త్రీల నైసర్గిక జ్ఞానాన్ని హత్యచేసి, స్త్రీలు పతిభక్తి కారాగారములో బంధితులై పురుషాధిక్య సమాజానికి తలవంచి. దానినే సతీత్వ మనుకొంటారని, అలాంటి భ్రమలో జీవించే స్త్రీలను గురించి 'బాపూజీ కావ్యం'లో -

ఇలు దీర్పంబనిచేయు యంత్రములుగా సృష్టించి పర్దాలలో
పలబంధించుట జేసి భారత సతుల్ స్వార్థాశయుల్ సెప్టనీ
.......స్వర్గము జూరలాడెదరు. సంతోషింత్రు నెమ్మేనిసా
మ్ములతో మెమ్మేలతో పురాతన కథా పుణ్యప్రసంగాలతో"అన్నారు.

నడుస్తున్న సమాజంలో ఉత్తమురాలైన స్త్రీలున్నారని, అదేవిధంగా మూర్ఖస్త్రీలు ఉన్నారని. వీరితో పాటు స్త్రీలను గౌరవించే పురుషులు లేకపోలేదని చెప్తారు.

అత్త రుసరుసలను, భర్త బుసబుసలను సహించే అమాయక స్త్రీలున్నంతవరకు ఈ సమాజంలో స్త్రీలకు కష్టాలు తప్పవని ఆ రావణ కాష్టంలా అలా కాలుతూ వుంటుందని స్త్రీలసహనాన్ని గురించి 'కొత్తలోకం'లో జాషువా-

"కలరు పతివ్రతల్ కలియుగంబునగూడ గయాళులైన య
త్తల కరకుందనంబునకు దాళి, పొగల్ సెగలన్ వెలార్చు భ
ర్తల పద పద్మముల్ గొలుచు దైవతకాంతలు వారివేదనా
జ్వలన శిఖావళిం జిదుమజాలవు నీ వివిధావతారముల్"

అంటారు. పురుష సమాజం స్త్రీని శాసించి, జీవితాంతం దాస్యంలో మగ్గి పోయేటట్లు చేస్తున్నది. దానికి కారణం స్త్రీకి విద్యాస్పర్శ లేకపోవడమేనని జాషువా భావిస్తారు.

"ఉల్లము లేని శాసనపుటుచ్చులకుం గురియై తపింతురా!

లే, లేచి రమ్మ"ని స్త్రీ జాతిని మేల్కొపుతూ, మగువ, మగవానికి తోడునీడగా మసులకోవాలే తప్ప, వంటింటికే అంకితం కాకూడదని మూఢా చారాల మత్తును వదిలించుకొని బయటకు అడుగువెయ్యాలని ఆహ్వానిస్తారు. స్త్రీ పురుషుల సమానత్వాన్ని సమర్థిస్తూ జాషువా 'ఖండకావ్యం'లో-

పాములు సంతానవరదాయకములంచు
ప్రార్థించు పెను వెఱ్ఱి బాగులమ్మ
ఔషధ సేవ చేయక సత్తులకు మ్రొక్కి
ప్రాణాలు బలిపెట్టు పరమ మూఢ
కృతకంబులైన పుక్కిటి కథానకములు
సత్యంబులని మ్రొక్కు చపల హృదయ
వికట సాంఘిక శక్తులకు దేహమర్పించి
తల ప్రాంత కేడ్చు విద్యా విహీన
పసుపురాయుచున్న ముసుగు బెట్టుచున్న
మారు పల్కలేని మందభాగ్య
ఖండపంచకమున కలికంబునకు లేదు
తలుపనేల ! భావ దాసురాల"అని అంటారు.

స్త్రీల స్వభావాన్ని పరికించి, వారి పరిస్థితికి ఎంతగానో పరితపించిన కవి జాషువా. సంతాన ప్రాప్తికి వరాలిచ్చే పామును నమ్మే వెఱ్ఱిది స్త్రీ. రోగం వస్తే ఔషధం తీసుకోక సత్తులకు మొక్కి నిండుజీవితాన్ని బలి తీసుకుంటున్న భారతస్త్రీ దైన్య స్థితిని ఈ పద్యంలో వర్ణించారు. విద్యావిహీన, వెఱ్ఱిబాగులమ్మ, భావదాసురాల వంటి పదాల ప్రయోగాలు స్త్రీల దుస్థితికి అద్దం పడుతున్నాయి.

స్త్రీకి సమాజంలో ఆర్థిక స్వాతంత్ర్యం, భావస్వాతంత్ర్యం, స్వేచ్ఛ తప్పక ఉండాలని జాషువా కోరుకుంటారు. అప్పుడే స్త్రీ జాతికి ఆదర్శ సమాజంలో గౌరవం లభిస్తుందని ఆశిస్తారు. స్త్రీలు పురుషులతోపాటు అన్ని రంగాలలోను సమానమని భావిస్తారు. స్త్రీలను తక్కువచేసి ఆలోచించటం ప్రగతి కాదని అంటూ "వ్యోమగామియైన వలంటేనా తెరిష్కోవను" కొనియాడుతారు 'ఖండకావ్యం'లో-

అసమాన ధీసమేతా
ప్రసిద్ధ వేదోండ విజయ భాసిని రషియా
వసుధా! వీరకుమారీ
ప్రసవాంజలి శతము నీకు వాలంటేనా!

గగరిను ప్రభృతుల సాహస
గగన విజేతలకు సాటిగా రాకెటుతో
నెగిరి జయించి వబలా
ప్రగతికి నాధర్మ మగుచు వాలంటేనా!

భారతఖండా శీమ్సుమ
హారంబులు నీకు నాయు రానందము చే
కూరుచుగాత! తెరష్కో
వా! రషియా వీరపుత్రి! వాలంటేనా !

స్త్రీలు కూడ మానవజన్మ నెత్తినవారే గదా! మానవత్వాన్ని మరచి స్త్రీలను భారతదేశంలో బానిసగా చేయడం శోచనీయ స్త్రీలకోసం శారదా చట్టము వచ్చి స్త్రీ జాతికి స్వేచ్ఛనిచ్చే మనస్సు పురుషులకు ఇంకా రాలేదని ఆవేదన చెందుతారు జాషువా 'ముసాఫర్లు లో-

ఆడుది లేకుండిన నీ
రేడు జగంబులకు శోభయేలేదు నరుం
డూడిగపు యంత్రమనుకొని
చేడెను బంధించి వ్యర్థజీవినొనర్చెన్."

స్త్రీ జాతి లేకపోయినచో ఈ మగజాతికి పుట్టుగతులు లేవని, స్త్రీ జాతియొక్క గొప్పతనాన్ని 'కొత్తలోకం లో' తెలియజేస్తారు. ముసాఫర్లులో స్త్రీ ఆవశ్యకతను గురించి

"మగ తెగయు నాడుతెగయును
తెగలున్నవి. రెండు ఆడు తెగలేకున్నన్
మగతెగకు పుట్టుగతిలే
దగణ్యములు రెండు తెగల యనుబంధముల్" అని చెప్తారు.

జాతికి శిరోధార్యమై నిలువగల స్త్రీలు మనదేశంలో ఉన్నారు. వీరు సంఘ సంస్కర్తలుగా మారి, స్వాతంత్ర్యంకోసం, సత్యాగ్రహాలు చేసి, దేశదాస్య శృంఖలాలను తెంపడానికి పాటుపడ్డారు. అటువంటివారిలో కస్తూరిబా సరోజినీనాయుడు, రమాభాయి వంటి స్త్రీ మూర్తులున్నారని, వారిని సేవలను, త్యాగాలను స్మరిస్తూ కాందిశీకుడులో

అనుంగు భర్తలతోడ దేశమునకై త్యాగంబు గావించి బం
ధన గేహాలదపించు వీరతులున్నారీ యుగంబందు మా
తెనుగున్ దేశపు రెడ్డి రాజులకు జాతి ద్వేష లేశంబులే
దనురా గ్రోన్నతముల్ విశాలముల నన్యంబుల్‌దదాకూతముల్

అంటారు. జాషువ రచనల్లో మానవతావాదంతోపాటు. స్త్రీలు సంపూర్ణమైన స్వాతంత్ర్యం అనుభవించాలని ఆకాంక్షించారు. వారు స్త్రీలపట్ల చూపిన దృక్పథము సర్వజనామోదం. స్త్రీలు ప్రగతిమార్గంలో పయనించి సుఖశాంతులతో జీవించాలనేది జాషువా కోరిక.

*జాషువా కవిత్వంపై కొత్త వెలుగులు : జాతీయ సదస్సు, 9-11-2001*

*(పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం-హైదరాబాదు)*



# సాహితీ కృషీవలుడు - దువ్వూరి రామిరెడ్డి

కాలానుగుణంగా సాహిత్యంలో వస్తున్న మార్పులను గమనించి సంప్రదాయ కవిత్వాన్ని ప్రక్కన పెట్టిన గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావులను అనుసరించి, తన రచనల్లో నవ్యతను ప్రదర్శించిన కవికోకిల దువ్వూరి. సంస్కృతాంధ్ర ఆంగ్ల పారశీక భాషల్లోని సంప్రదాయాలను క్షుణ్ణంగా తెలుసుకొన్నప్పటికీ, ఆంగ్ల సాహిత్యంలోని Pastoralison అనే ప్రకృతి కవిత్వాన్ని తెలుగులోకి తీసుకొని వచ్చిన ప్రకృతోపాసకుడు!

1895వ సంవత్సరం నవంబరు 9వ తేదీన నెల్లూరిజిల్లాలోని గూడూరులో జన్మించారు. వీరి తల్లితండ్రులు లక్ష్మీదేవమ్మ, సుబ్బారెడ్డి. చిన్నతనంలోనే తండ్రి పరమపదించడం, తల్లితో విభేదాలు కారణంగా పెమ్మారెడ్డిపాలెంలోని పినతల్లి ఇంటిలోనే ఉండేవారు. 'ఇప్పటివరకూ నా జీవితమంతా ఆ గ్రామంలోనే కొనసాగిందని ఆ పరిసర ప్రభావాలవల్లనో, ఎందుచేతనో నా జీవితంలోనికి కవిత్వం తొంగి చూసిందని, ఆ గ్రామీణ వాతావరణాన్ని సాహిత్యంలో కూడా పొందుపర్చి ఎన్నో కావ్యాలను రాశా' నని చెప్పుకొన్నారు. 19వ యేట జరిగిన చిన్న సంఘటనే "నా తొలిరచన" అనే వ్యాసానికి శ్రీకారం చుట్టిందని వారొకచోట పేర్కొన్నారు.

పాఠశాలలో చదివిన విద్య తక్కువ అయినా స్వయంకృషితో కష్టపడి పాండిత్యాన్ని సంపాదించి, ఆధునిక సాహిత్యంలో తనదైన ఒక ప్రత్యేక స్థానాన్ని ఏర్పరచుకొన్న ప్రజాకవి దువ్వూరి రామిరెడ్డి.

దువ్వూరివారికి రచనావ్యాసంగాన్ని చేపట్టేనాటికి తెలుగుసాహిత్యంతో పెద్దగా పరిచయం లేదు. అయినప్పటికీ అతనిలోని సృజనాత్మకత హృదయాన్ని తట్టి కవిగా నిలబెట్టింది. తెలుగు సాహిత్య చరిత్రలో సుప్రసిద్ధులైన కవులలో కొందరు, పండితుల తిరస్కారాలకు, సాంఘిక దురాచారాలకు గురి అయినవారే! అదే రీతిలో దువ్వూరి కూడా పండితుల తిరస్కారాలకు, అవమానాలకు గురి అయ్యిన సంఘటనలు ఎన్నో ఉన్నాయి. అయినప్పటికీ పట్టువీడక తెగించి కవితారచనకు పూనుకున్నారు. ఆ సమయంలోనే సుప్రసిద్ధ కవులైన దర్భా సుబ్రహ్మణ్య శాస్త్రి గారి అండదండలు, వేదం వెంకటరాయ శాస్త్రిగారి ప్రోత్సాహం వారిని కావ్యరచనలోవరకూ తీసుకెళ్ళి, కావ్యరచన చేయించేలాగున చేసింది. ఏ పండితులైతే వీరి కావ్యాలను విమర్శించారో ఆ పండితుల చేతనే ప్రశంసలనూ అందుకున్న సాహితీ కృషీవలుడు దువ్వూరి.

'కాంగ్రెస్‌వాలా' నాటికలో "హేళన పాత్రమై మొదట నింతగనింతగ మోసులెత్తి వేవేలకు వేలునౌచు జన విశ్వసనీయముగా జెలంగి యుద్వేగాల పయోధివీచికల తీరున రేగి సమస్తదేశమున్ మూలము ముట్టనూచె(గద"......జాతీయోద్యమపురోగతిలో జనసామాన్యంలో కలిగిన భావవికారాలన్నిటికీ కావ్యరూపం కల్గిస్తూ, మిగతావారితో సమానంగా తన జీవితంతో జరిగిన అంశాలను రచనలో పొందుపరుస్తూ చెప్పిన పద్యం ఎంతో హృద్యంగా కన్పిస్తోంది.

దువ్వూరి వారు రాసిన 'నలజారమ్మ' కావ్యం తన వంశంలో జరిగిన సంఘటన. దీనిని నవ్యకవిత్వ లక్షణమైన ఆత్మాశ్రయరీతిలో రాశారు. వీరు 1915వ సంవత్సరం నుండి వ్రాయడం మొదలుపెట్టి 1942 వరకూ రాస్తూనే ఉన్నారు. స్పందన లేనిదే కేవలం రచనగా రచనచేయడం ఇష్టంలేకనే అనుభూతి పూర్వకంగా వ్రాసారు.

దువ్వూరి రామిరెడ్డి రచనలను కొన్ని ప్రధానాంశాలుగా విభజన చేయటం వల్ల వారి సాహిత్యకృషి ఎంత విస్తృతమైనదో తెలుస్తుంది. అవి సామాజిక రచనలు, నీతిబోధాత్మక రచనలు, గ్రామ జీవన రచనలు, విజ్ఞాన శాస్త్రరచనలు మరియు ఇతర రంగాలకు చెందిన రచనలుగా చెప్పవచ్చు. వీరు సామాజిక ఇతివృత్తాలను తీసుకొని రమణీయంగా వర్ణించిన కావ్యాలు నలజారమ్మ, యువకస్వప్నం, కడపటి వీడ్కోలు, కృషీవలుడు, పానశాల మొదలైనవి.

నలజారమ్మ కావ్యాన్ని పరిశీలిస్తే గూడూరులో ఈనాటికీ నలజారమ్మకు కైంకర్యం జరుగుతున్న విషయాలు స్పష్టం అవుతాయి. అంతేకాకుండా నేటికీ ఆ గుడి ఉన్న వీధిపేరు కూడా నలజారమ్మ పేరే వాడుకలో ఉండడం గమనించవచ్చు. దువ్వూరి రామిరెడ్డి నలజారమ్మ పాత్రను పతివ్రతా శిరోమణిగాను, యాచకుల పాలిట కల్పవల్లిగాను వర్ణిస్తూ....

"ఇంటికి నమ్మ భిక్షమని యెవ్వరు వచ్చిన బొమ్మ్మ పొమ్మనీ
వంటివారు చాలమంది యనివాదులు సల్పక వడ్లా బియ్యమో
వంటకమో తగుంగాలది వచ్చిన యర్థులకిచ్చి పంపువా
ల్గంటి ప్రమోద చిత్తమయి, కల్గిన దిద్దియెయంచు చెప్పచున్"

అని అంటారు. మరో కావ్యం "కడపటి వీడ్కోలు"లో నాయినా నాయకులయిన శారదాగౌతముల సంభాషణల ద్వారా స్నేహభావాన్ని ప్రతిపాదిస్తూ, నాయిక శారదతో గౌతముడు -

"యౌవనమని కామమని సవ్యాధ్యమనుచు
నేమేమొ వచించితి వింతసేపు
ఇంద్రధనువు చిరంబని యెంచినావె?
చాలు చాలు సంసారవాసనలు సకియ"

అని అంటాడు. యౌవనం, కామం, ఇంద్రధనుస్సువలే క్షణికమైనవని, శాశ్వతంగా ఉండేది స్నేహమే అని ప్రకటిస్తాడు. ఇక్కడ అన్యాపదేశంగా అమలిన శృంగార సిద్ధాంతాన్ని గౌతముని ద్వారా దువ్వూరి ప్రతిపాదించినట్లు స్పష్టమవుతుంది. మరోచోట గౌతముడు నాయిక శారదతో తన విశ్వప్రేమను వ్యక్తపరుస్తూ ఇలా అంటాడు -

"విశ్వమెల్ల తనదిగ భావించు ప్రేమ
గలుగ నేకాశ్రితంబైన కామమేల
చిన్ననాటి యజ్ఞానంపు జిన్నెలెల్ల
మఱచిపొమ్ము ప్రేమింతు నిన్నిరతమతివ"

కృషీవలుడు రాసేనాటికి రామిరెడ్డిగారి జీవితంలోనూ, కవిత్వంలోనూ గ్రామీణత్వం ప్రస్ఫుటంగా అంకితమై ఉంది. కావ్యాన్ని పరిశీలిస్తే ఒక విలాపధ్వని (Elegiac Note) వినిపిస్తుంది. కర్షకుని మూగబాధలను దువ్వూరి కంటే మిన్నగా వ్యక్తం చేసే కవి ఉండేదేమోననే అనుమానమూ కలుగకమానదు. రైతు దేశానికి వెన్నెముక. అటువంటి రైతు జీవితాన్ని వస్తువుగా స్వీకరించి, నవ్యతను సాధించి, కర్షకపక్షపాతిగా కాకుండా 'కర్షకకవి'గా ఆంధ్రదేశంలో మన్ననలను పొందిన కృషీవలుడు మన రామిరెడ్డిగారు. కృషీవలునికి కర్తవ్యోపదేశం చేస్తూ ఒకచోట -

"శ్రమలు లేకయే ఫలములు దుమకబోవు
పిండి కొలదియే రొట్టె యోపిన విధాన
కష్టపడుము కృషీవలా! గలుగు సుఖము
ఉత్త యాసల కన్న మేలుద్యమంబు"

అపుడే శ్రమకు తగిన ఫలితం లభిస్తుందని చెపుతారు. ప్రకృతిని జూచి పరవశించి తానే ప్రకృతిలోని సుందరవస్తువుగా సృజింపబడినచో ఎంతో ఆనందంగా ఉండేదని భావిస్తూ ప్రకృతి కవిత్వాన్ని ఎన్నో అంశాలతో వ్రాసారు కవి. వర్షాకాలంలోని మబ్బులను చూస్తూనే దువ్వూరి వారు తన బాల్యాన్ని గుర్తు చేసుకుంటూ -

"అల్లిబిల్లులు దిరుగ నాటకాలాడంగ
వాగులై వీధుల బ్రవహించునీట
గాళ్లడ్డముగ బెట్టి కట్టలు గట్ట
ప్రతివాన కాలంబు బాల్యంబు దాల్ప"

బాల్యం గడిచి యౌవనం వచ్చినా పసితనపు చేష్టలు విడువక నవ్యంగా ఉన్నాయని వర్ణిస్తారు. వర్షాకాలం భూమి పైరు పచ్చలతో కళకళలాడుతుందని నిష్కల్మషమైన గ్రామీణ జీవనపు కమ్మదనాన్ని -

"ప్రకృతి లీలా విలాస కావ్యంబునందు
రసవదధ్యాయ మేమొ వర్షంపు ఋతువు
కానిచో దదధ్యేతలౌ కర్షకులకు
నెటుల బరనిర్వృతం గూర్చియింపెలర్చు" అని వర్ణిస్తారు కవి.

ప్రకృతిలో పరవశించి కవిత్వాన్ని రాసిన ఈయన దేశభక్తి కవిత్వంతోపాటు, స్మృతి కవిత్వం కూడా రాశారని, పరిశీలన వలన తెలిసే విషయం. 1928లో రాసిన "జాతీయత"లో స్వాతంత్ర్య రథాన్ని నడపడానికి జాతీయత ప్రధానమైనదని వివరిస్తూ-

"పూర్వకీర్తి ప్రతాపంబు బొగడినావు
భావి భాగ్యోదయంబగ పఱచినావు
వర్తమాన దాస్యంబును వదలజేయ
నేయుపాయంబు వెదకెదోయింకమీద"

అని వర్తమాన దేశ దాస్య వ్యవస్థ నిర్మూలనకు కృషి చేయవలసిన ఆవశ్యకతను వివరించారు. భార్య మరణించిన ఒక సంవత్సరానికి "స్మృతికణము" 1926లో రచించారు. దీనిలో -

"తెల్లవాఱిన బూదండదీసివైవ
దరుణి వేణిక నిలుచు నెత్తావి పోల్కి
మర్త్యమౌ నీ స్వరూపము మాటువడియు
సార వర్ణాంకిత స్మృతి సమసిపోదు" అని రాశారు.

కనులు మూసిన తెరచినా ఇంటిలో తిరుగాడుచున్నట్లు ఉందని హృదయ వేదనను మరెన్నో పద్యాలలో వ్యక్తీకరిస్తారు దువ్వూరి.

దువ్వూరి రామిరెడ్డిగారు కేవలం కావ్యాలతోనే ఆగిపోకుండా 'కర్షకవిలాపం', 'సీతావనవాసం', 'కుంభరాణా', 'మాధవవిజయం', 'కాంగ్రెస్‌వాలా' వంటి ఉత్తమమైన నాటకాలు, వ్యాసాలు, శతకాలు కూడా రాశారు. పానశాలకర్తగా, కర్షకకవిగా, దేశభక్తునిగా, ప్రకృత్యారాధకునిగా, ఆధునిక సాహిత్యంలో నవ్యాంధ్రకవిగా కీర్తింపబడిన దువ్వూరి "నేను మరణింప బోనోయి, మేనే మడియు, అదియును మొదలంట నాశనమగుట లేదు" అని పలితకేశంలో ప్రకటిస్తారు. "సుకవికి మరణం లేదన్న మాట" దువ్వూరివారి పట్ల, ఆయన రచనలను చూసిన తర్వాత స్మరణకు రాక తప్పదు. దువ్వూరి కవితాభిమానుల నాల్కలపై జీవిస్తున్న సాహిత్య కృషీవలుడేనని స్పష్టమవుతూ, నిత్యం బ్రతికే ఉంటారు.

- వాఙ్మయి - *2000*



# భాగ్యనగర కోకిల భావాభివ్యక్తి

భావకవుల్లో సుప్రసిద్ధులైన కవి నాయని సుబ్బారావు గారు. వీరు హైదరాబాదులో అడుగపెట్టిన కొత్తలో అనగా 1958 సంవత్సరంలో రాసిన కావ్యమే ఈ భాగ్యనగర కోకిల. వివిధాంశాలకు సంబంధించిన ఇరవై అయిదు ఖండికలు ఈ కావ్యంలో ఉన్నాయి. ముక్తకాల వలె ఈ ఖండికలు వైవిధ్యంతో కూడుకొన్న ఒక విధమైన సందేశాన్ని సాహిత్యాభిమానులకు అందిస్తున్నాయి. ఈ కావ్యాన్ని చదివితే వారి వ్యక్తిత్వం మనకు తెలుస్తుంది.

భాగ్యనగరం ఎప్పుడూ వసంతంగానే భాసిల్లుతుందని, వసంతంలో వచ్చే ఆ కోకిల గానానికి, ధనవంతులు, మధ్యతరగతి కుటుంబీకులు, పేదరికాన్ని అనుభవిస్తున్న దంపతులు కూడా మన్మధావస్థకు గురవుతారని కవి భాగ్యనగర కోకిల ఖండికలో-

"నీ మహిమ యెట్టిదో నీ
శ్రీ మధుర కలస్వనమున చిగిరించిన వా
రై మరులు కొందు రతియును
కాముండు ననంత రూపకలనా గరిమన్"

మరొక పద్యంలో కోకిల గానం ఇచ్చట స్వరర్తుకముగా ఉందంటారు కవి.

"అన్య వన్య స్థలమ్ముల నచిరకాల
మున వసంతుడు తానొక్క ముసలివాడు.
త్వద్దయా పోషిత ప్రాణధనుడు వాడు
నిత్య నూతన యౌవనాన్వితుడిచట".

ఆర్య ధర్మములైన సత్యం, భూతదయ, అహింస, ఆత్మశక్తి వంటి గుణాలు, మానవుల్లో నేడు లోపించాయని పసిపిల్లల్లో కూడా మాత్సర్యం చోటు చేసుకున్నదని, అటువంటి గుణాలను మరల నేర్పుటకై దయతో ఈ పుడమిపై అడుగిడమని పరితపిస్తారు "గాంధీ స్మృతి" లో నాయని.

"ఆర్య ధర్మమ్ములైన సత్యమునహింస
భూతదయ యాత్మశక్తియు బొసగ మఱల
మాకు నేర్పుటకై దయామహితవృత్తి
బుడమి నడుగిడు పురుషోత్తముడవు నీవు"

దేశ శ్రేయస్సుకోసం, సమాజాభివృద్ధి కోసం మంచిని బోధించే మహాత్ముడు మనకు అందనిదూరంలో ఉన్నా వారి వాక్కులు మనకు శిరోధార్యం. అటువంటి మహాత్ముని నాయని సుబ్బారావు స్మరించడంద్వారా వారిలో ఎంతటి దేశభక్తి కలదో మనకు అర్థం అవుతుంది.

మరో ఖండిక - 'జనవరి ఇరవైయాఱు' లో -

"లేదు పెట్టరయ్యా యను బీదమాట
లేదనుచు సర్వసమతా మహోదయమున
లేదనుచు విశ్వసౌభ్రాత్ర మోదనమున
అదె జనేవరి యిరువది యాఱు వచ్చె
ఇదె జనావళి యాత్మల కెలమి తెచ్చె"

స్వాతంత్ర్యం రావడానికి భారతీయులంతా కలిసి మెలిసి కృషి చేశారు. వారి అందరి కృషి ఫలితమే ఈ జనవరి ఇరువది ఆరు పండుగదినం. జనవరి ఇరవైఆరు అంటే ఏమిటో ఇలా వర్ణిస్తున్నారు. ఈ దేశంలో అడిగినవారికి లేదనేమాట వినపడదని అందరిని సమాదరణతో చూస్తూ సర్వమతాలవారు కలిసి మెలసి విశ్వసౌభ్రాతృత్వాన్ని ఆకాంక్షిస్తున్న నేపథ్యంలో వచ్చింది జనవరి ఇరవైఆరు. అది జనవరిలో ఆనందాన్ని కూరుస్తుందని అంటారు.

ఆంధ్రదేశానికి ఉన్న రత్నగర్భ అన్నమాటను నిలబెడుతున్నవారు కర్షకులే సుమా! కర్షకులు భూమిని దున్ని అందులోంచి ఖరీదైన సస్యఫల రత్నాలను తెస్తున్నారు. అటువంటి కర్షకుల చేతి చలవను, వారి శ్రమను గురించి కర్షకోత్కర్షములో-

"అవని రత్నగర్భ యనుమాట సార్థక
మయ్యె మీరు నిశిత హలముఖమున
నవని జీల్చి సకల భువన పోషక సస్య
ఫలమహార్ఘరత్నములను తీయ"

ఆ విధంగా కర్షకులు పాటుపడితే మిగిలినవాళ్ళంతా ఏవిధంగా ధనవంతులు అవుతున్నారో కవి మరో పద్యంలో కర్షకుల త్యాగాన్ని గురించి -

"వారు దేశ నాయకులైరి వారు ప్రభువు
లైరి మంత్రు లైనారు వ్యాపార లబ్ధ
సర్వధనులైరి మీ చేతి చలువ చేత
ఓ కృషికులార! మీదే నహో సుకృతము"

అని పేర్కొంటారు. కవులు ఎన్నో విషయాలపై స్పందించి కవిత్వం రాస్తారు. నాయని సుబ్బారావు గారు రేడియో స్టేషన్లో పని చేసుకునే, నాల్గవ జాతికి చెందిన ముసలి అవ్వను గురించి ఎంతో హృద్యంగా రాశారు. తీరని వ్యాధితో అవ్వ మరణం నాయని మనస్సును కుదిపి వేసింది. ఆ సందర్భంలో రేడియో అవ్వ అన్న శీర్షికతో కవి-

"బ్రదుకంతయు గ్రీష్మ పర్వమాయవ్వ
బడుగు దేహములోని పస యెల్ల పోయి
చమురు పట్టిన మేని చర్మ బంధమ్ము
ముడుతల గీఅలై ముడుగు నాయవ్వ
వలి కోత శిశిరంపు పర్వమా యవ్వ
దేవాలయమ్మున దివ్వెలో యనగ
నతిలోక కాంతి రమ్యమ్ములౌ కనుల
పరిమళించు వసంత పర్వమాయవ్వ"

అని ముసలి యవ్వ దేహ స్థితిని కళ్ళల్లో వెలిగే కాంతిని వర్ణించారు.

దేశనాయకుల్లో పరిపాలన దక్షత లోపించినదనడానికి కారణాలేమిటో కవి చెప్తారు. ఏ ఒక సమస్యను మరొక సమస్య పుట్టకుండ పరిష్కరించలేదంటూ - సమస్యా పూరణంలో -

"పంచుల పందారింపుల
వంచితులరుగాక ధర్మ పరిణత బుద్ధిన్
సంచిత సుస్థిర శాంతి స
మంచిత శోభనము పంచుడయ్య, ధరిత్రిన్"

అని వారికిని ప్రబోధిస్తారు కవి నాయని.

1958-64 సంవత్సరాల మధ్యకాలంలో దేశంలో జరిగిన వివిధ సంఘటనలను కవి వర్ణించారు. భగవద్విఖ్యాతిలో చీకటి కోణాలలో దివ్య దర్శనంలో తిరుమలేశునికి చేసుకొన్న విన్నపాలలో కవికి గల తాత్త్విక దృష్టి స్పష్టమవుతుంది.

దయాగుణం లేని ప్రభుత్వాల పరిపాలన, ప్రజల్లో కనుమరుగైన అహింసా, సత్యభూతదయాగుణాలు కవిని కలచి వేసినయ్, రేడియో అవ్వలో కవి చూపించిన భూతదయాగుణాన్ని ఎన్నటికీ మరువలేం. ఆంధ్రదేశంలో ప్రసిద్ధి పొందిన తోలు బొమ్మలాటను గురించి అద్భుతమైన వర్ణన చేశారు. జానపద కళల్లో తోలుబొమ్మలాట

ప్రధానమైంది తోలుబొమ్మను ఆడించే అతడు కూడా బొమ్మైనాడని కవి చమత్కరిస్తారు. తోలుబొమ్మలాట -

"ఆంధ్రదేశమ్ములో బొమ్మలాటపల్లె
అచట నొక మానవ బ్రహ్మ యవతరించి
జింక తోల్ కత్తిరించి సృష్టించి సురల
మేక తోల్ కత్తిరించి నిర్మించి నరుల"

అలా చేయబడి ప్రదర్శించబడ్డ తోలు బొమ్మలాటను వర్ణిస్తూ నాయని -

"ఆడునవి తోలు బొమ్మలు
పాడును తోల్బొమ్మగడలు పట్టాడించే
వాడును తోల్బొమ్మై దం
డాడు తెనుగు తోలుబొమ్మలాట ధరిత్రిన్"

గడలు పట్టాడించే వాడు తోలుబొమ్మై ఆడును భూమిపైన అవి ఎంతో సహజరీతిలో కన్పిస్తున్న తోలుబొమ్మలాట ప్రాముఖ్యతను ఈ ఖండికలో రాసారు. నాయని సుబ్బారావు గారి కావ్యాలన్నీ ఒక ఎత్తు ఈ భాగ్యనగర కోకి కావ్యం మరొక ఎత్తు. కవికి తాను రాసిన కావ్యాలన్నీ ఆనందాన్ని చేకూర్చేవే. ఆ కావ్యాలలోని మూలతత్తాన్ని ఆస్వాదించే పాండితీపరులకు రసానుభూతితోపాటు కవి వ్యక్తిత్వం అర్థం అవుతుంది. ప్రేమకావ్యాలతోపాటు స్మృతి కావ్యాలను రాసిన నాయని సుబ్బారావు కలం నుంచి వెలువడిన భాగ్యనగర కోకిల భావాభివ్యక్తితోపాటు నూతన పదబంధాల ప్రయోగాలతో అలరించినదనటంలో అతిశయోక్తిలేదు. ఈ కావ్యంలోని ఖండికలన్నీ సాహిత్యాభిమానుల మన్ననలు అందుకున్నవే.

*- నాయని సుబ్బారావు శతజయంతి సంచిక-2000*



# రావిశాస్త్రి 'కథల్లో' ఏం చెప్పారు?

మనిషికి అస్తిత్వం ఎంత ముఖ్యమో రచయితకు కూడా అంతే అవసరం. దానికోసం మొదట్లో వెతుకులాట లేకపోయినా, తర్వాతి కాలంలోనైనా తప్పకుండా ఆ అన్వేషణ మొదలవుతుంది. అదే అనుభవాన్నిస్తుంది. ఆ అనుభవం నిగ్గుతేలిన రచనను అందిస్తుంది. అప్పుడే నిబద్ధత గురించిన సంఘర్షణ కూడా ప్రారంభమవుతుంది. కళ కళ కోసమా? కళ ప్రజల కోసమా? అనే తార్కిక ప్రశ్న వెంటాడుతుంది. తన చుట్టూ ఉన్న పరిసరాల ప్రభావమే దాన్ని నిర్ణయిస్తుంది. ఎంత కాదన్నా అది ప్రతి రచయితలోనూ ఈషణ్మాత్రంగానైనా ఉంటుంది. రావిశాస్త్రిగారి కథల్ని పరిశీలించినపుడు ఈ పరిణామం మరింత స్పష్టంగా గోచరిస్తుంది.

శాస్త్రిగారు తన కథల్లో మధ్యతరగతి జీవితానుభవాల్ని, వారి మానసిక ప్రవృత్తులను, విడదీయలేని వర్గ సంఘర్షణను నిక్షిప్తం చేసి, వాటి పరిష్కారాలేమిటో కూడా తెలియపరచిన ప్రతిభావంతుడు. పాత్రోచితమైన భాషతో అవసరమైనపుడు చిన్న చిన్న వాక్యాలతో కవితాత్మకంగా సుదీర్ఘమైన జీవితాన్ని పాఠకుని హృదయంలో కలకాలం నిలిచిపోయేలా వర్ణించటం రావిశాస్త్రిగారి ప్రత్యేకత. 'మెరుపు మెరసింది' కథలో 'నీరజ' పాత్ర చిత్రణలో "అదిగో మెరుపు. ఇదే మాయమయ్యింది. మళ్ళీ మెరిసింది. మాయమయ్యింది. ఇంతే ఇది. ఆఖరికిదే నిజం. ఈ చీకటీ ఇదే నిజం..."అనేది కవితాత్మకంగా సాగిన శైలికి చక్కని ఉదాహరణ. రావిశాస్త్రిగారు కూడా 'నేను మొదట్లో కథలు రాసినపుడు సరదా కోసమో గొప్ప కోసమో తప్ప మరెందుగురించీ రాయలేదు. మనం కూడా కథల్ని రాసేం, అవి పత్రికల్లో పడ్డాయి. అంటే నాకు చెడ్డ గొప్పగా ఉండేది. కాని రానురాను ఆ పంథా మారిపోయింది' అని తనే చెప్పుకున్నారు. రచయిత స్థానం వెతుక్కోవటం, అస్తిత్వాన్ని నిరూపించుకోవటమంటే ఇదే. కాబట్టి తాను రాసిన కథలు పాఠకుల్ని ఆహ్లాదపరచడమే కాకుండా ఆలోచనలో కూడా పడేశాయి. వృత్తిరీత్యా న్యాయవాదిగా ఉన్న రచయిత, తన దగ్గరకొచ్చిన పేదల బతుకుల్ని చదివారు. వాటినే అక్షరీకరించారు. 'సారా కథలు' 'బాకీ కథలు, 'ఋక్కులు' మొదలైన వాటిలో దేన్ని తీసుకున్నా సమాజంలో జరిగే పీడనను శక్తివంతంగా చిత్రించటం కన్పిస్తుంది. భౌతికంగా, ఆర్థికంగా, సామాజికంగా దోపిడీకి గురయ్యే కొంతమంది గురించి 'సారాకథలు'లో వెల్లడించారు. యజమానుల కోసం నేరాల్ని మీదేసుకోవటం, శిక్షలు అనుభవించటం ఎంత సర్వసాధారణమో, అటువంటి పరిస్థితులు ఎలా వస్తాయో హృద్యంగా వర్ణించారు. 'న్యాయం' న్యాయస్థానాన్ని వదిలి ప్రజల దగ్గరికి రాకపోవటాన్ని, ప్రభుత్వ యంత్రాంగం,

భూస్వాములు చేసే ప్రయత్నాలు, దానివల్ల అమాయకులు బలయ్యే జీవితాల్ని కూడా రావిశాస్త్రిగారు 'ప్రత్యక్షం'గా చూపించినట్లు వర్ణించారు. పరిసర ప్రభావాల నుండి రచయిత తప్పించుకోలేడనటానికి నిదర్శనంగా వీరి కథల్లో కేసులు, సారా కాంట్రాక్టర్లు, పోలీసులు, ప్రభుత్వ యంత్రాంగం చేసే దౌర్జన్యాలు, కేసులు మారిపోయే పద్ధతులు వంటివి ఎక్కువగా కథా సన్నివేశాల్లో తటస్థించటం ద్వారా గమనించవచ్చు. డబ్బు 'మనిషిని - నైతిక విలువల్ని' ప్రభుత్వ యంత్రాంగాన్ని ఏ విధంగా శాసిస్తుందో, ఆర్థిక పరిస్థితుల వల్ల ఆశలు, ఆశయాలు ఎలా కుప్పకూలిపోయి, బతుకులు ఛిద్రమయి పోతున్నాయో 'మెరుపు మెరసింది' 'నీడలు' వంటి కథల ద్వారా తెలిపారు రచయిత. ఒక సున్నితమైన జీవితాన్ని వర్ణించగల నేర్పు ఉన్న రచయితే ఒక దుర్మార్గుడైన మనిషిని కూడా చిత్రించటం కన్పిస్తుంది. 'పువ్వులు' కథలో భూమి ఒకరిది. బంతిపూల తోట పెంచినదేమో మరొకరు. కానీ నిస్సహాయ స్థితిలోకి వెళ్ళిపోయి అసహాయతను, మానసిక క్షోభను 'కమల' పాత్ర ద్వారా అద్భుతంగా చిత్రించటం కన్పిస్తుంది. కథనా కౌశలం గల రచయిత జీవితానుభవాల్ని కథగా మలిచినపుడు వాస్తవాన్ని విశదీకరించటంలో 'కాంతా సమ్మితయో దేశయుజే'గా చెప్పటమంటే రావిశాస్త్రి కథల నుండే నేర్చుకో వాలన్నట్లుగా ఉంటాయి. 'తప్పు' కథలో తనకి అన్యాయం జరిగిందని తెలిసికూడా, అన్యాయం చేసినవార్ని రక్షించటం ద్వారా పేదవాళ్ళెపుడూ దయార్ద్రహృదయులుగా, మానవత్వాన్ని గుభాళించే వారేనని కరుణరస స్ఫోరకంగా తెలియజేశాడు రచయిత. మనిషికి మరొక మనిషి పట్ల పెరగవల్సింది ద్వేషం కాదనీ, ప్రేమేనని, కొన్నింటికి విలువ కట్టడానికి డబ్బు సరిపోదని తెలియజేయటానికి 'తప్పు' కథ గొప్ప నిదర్శనం. స్త్రీకి ఎప్పుడూ అన్యాయం జరుగుతూనే ఉంది. అయితే అది అనేక విధాలుగా జరగవచ్చు. బతకటం కోసం ఒళ్లు అమ్ముకునేవాళ్ళు కొందరయితే, కొన్ని విపత్కర పరిస్థితులకు బలి అయ్యి వ్యభిచార కూపంలో కూరుకుపోయేది ఎందరెందరో! కాని స్త్రీ పురుషులు వ్యభిచారంలో పట్టుబడితే స్త్రీలకే శిక్షపడే వ్యవస్థ మారాలనీ, ఆ సమస్యకు శాశ్వత పరిష్కారం కనుగొనాలని రాసిన 'న్యాయం', కథ స్త్రీవాద దృక్పథానికి చక్కని నిదర్శనం. రావిశాస్త్రిగారు కథలకు పేరు పెట్టడంలోనే చెప్పదలచుకున్న భావాన్ని, విషయాన్ని తెలియజేస్తారు. కొన్ని పేర్లు వ్యంగ్యంగా కూడా పెట్టడం జరిగింది. 'రచ-ఇ-త' కథలో రచయిత ఇంబళూర్ తమ్మయ్య చేసిన పని, దానిని సమర్థించుకుంటూ రాసిన కథవల్ల ఒక విధవరాలు ఆత్మహత్య చేసుకునేందుకు ప్రేరేపించిన పరిస్థితులు తెలిపారు. 'రొట్టెముక్క' కథలో 'మూర్తికవి' పాత్ర కళను పెట్టుబడి పెట్టేవానికి ప్రతినిధిగాను చిత్రించటం జరిగింది. రెండింటిలోనూ రచయిత రచన చేసేటపుడు ఎంత బాధ్యతా యుతంగా ఉండాలో తెలియజేస్తూ, తనకున్న సృజనాత్మక శక్తిని వక్రమార్గాలకు ఉపయో గించుకోవటం మంచిది కాదనే హితబోధ కన్పిస్తుంది.

'జాస్మిన్' 'కాంతాకాంత' 'గోల్కొండ ప్రసాద్' మొదలైన పేర్లతో కూడా కథలు రాసిన రావిశాస్త్రిగారు తరువాతి కాలంలో అనగా సంపుటీకరించేనాటికి మాత్రం 'రావిశాస్త్రి' పేరుతోనే ఆ కథలు వెలుగుచూశాయి. 'సైగల్' మీద రావిశాస్త్రి గారికి ఉన్న అభిమానమే 'సైగల్' మీద కథకి ప్రేరణ అయ్యింది. వారిది అచ్చయిన తొలి కథ 1938లో 'దేముడే చేశాడు' నుండి తన కలం ఆగేవరకూ మానవ జీవితాల్లోని క్లిష్టతను, మానసిక ప్రవృత్తులను అద్భుతంగా వర్ణిస్తూనే వచ్చారు. వీరి కథలు అన్నింటినీ పరిశీలిస్తే ప్రధానంగా సమాజంలో పేదవాణ్ణి మధ్యతరగతి, మధ్యతరగతివాణ్ణి ఉన్నతవర్గం, ఉన్నతవర్గాన్ని ప్రభుత్వ యంత్రాంగం, ప్రభుత్వ యంత్రాంగం పేదవాళ్ళనీ ఏ విధంగా పీడించుకు తింటున్నదో ఒక 'పీడిత చక్రాన్ని' వర్ణించిన కథక చక్రవర్తి రావిశాస్త్రి గారే ననటంలో సందేహం లేదు.

*- ఆదివారం ఆంధ్రభూమి, ఆగస్టు 17, 1997.*



# మట్టినుంచి ఆకాశానికెగిసిన మానవుని అన్వేషణే సినారె "మట్టీ - మనిషీ - ఆకాశం"

కవి సమాజంలో బతకాలి, సమాజంతో బతకాలి, సమాజమై బతకాలి. అనే విషయాన్ని త్రికరణశుద్ధిగా పాటించి రాసిన డా॥సి. నారాయణరెడ్డి గారి కావ్యం 'మట్టీ-మనిషీ-ఆకాశం' 'విశ్వంభర' తరువాత మానవుని అన్వేషణను అన్వీక్షణను చక్కగా ప్రతిబింబించే కావ్యమిది. సినారెకి మట్టి, ప్రకృతిపట్ల ఎనలేని ప్రేమే కన్పిస్తుంది. మట్టిలో మనిషిని, మనిషిలో మట్టిని దర్శించగల ప్రకృతి తాదాత్మ్యభావం కవి హృదయానికే సాధ్యమవుతుంది. అది సినారె నుండి వచ్చిన ప్రతి అక్షరం చెప్పే సత్యం!

నిరంతర అన్వేషి అయిన మానవుని అన్వేషణకు మూలం పరిణామ శీలం. ఆదిమకాలంలో నగ్న దేహంతో తిరిగిన మానవుడు, తన వికాసదశలో నేడు గ్రహాంతరవాసం చేసేవరకూ ఎదిగాడు. కృత్రిమ గర్భధారణ చేయగలిగే విజ్ఞానాన్ని సాధించాడు. మానవుని ప్రాణం కూడా వీలయితే సృష్టించటానికి ప్రయత్నిస్తూనే ఉన్నాడు. ఇదంతా కవితా రూపంగా మనిషి మట్టితో పుట్టి, మట్టిమీదనే వృక్షమై పెరిగి ఆకాశమంత ఎత్తుకి ఎదిగిన స్థితిని అద్భుతంగా వర్ణించారు కవి.

'మట్టీ-మనిషీ-ఆకాశం'లో నిత్యపరిణామశీలికి నిద్రలో కూడా నిద్రపట్టని అన్వేషణ చైతన్యాన్ని వెల్లడించటానికి ప్రయత్నం జరిగింది. మానవుల్లో ఉండే చైతన్యం వల్ల జరిగిన సంఘర్షణ స్వరూపాన్ని కూడా కావ్యంలో వర్ణించటం జరిగింది. అంత అభివృద్ధీ, వికాసం జరుగుతున్నప్పటికీ దళితులు, పీడితులు ఎలా నిర్లక్ష్యానికి గురికాబడుతున్నారో అనే వేదన కవి హృదయం నుండి కవితాజలపాతం బయటికి ప్రవహించింది. కావ్యాన్ని పదకొండు భాగాలుగా విడదీసి చూపగలిగేలా ఉన్నప్పటికీ, ఎక్కువ భాగాలు తాత్త్విక దృక్పథాన్ని తెలియజేసే భాగాలేనని చెప్పవచ్చు. ఒక మత విశ్వాసాన్ని, దాని ఆధారంగా చేసుకొని నేటి పరిస్థితిని అన్వయించి మానవుని చైతన్యం అభివృద్ధి చెందిన స్థితిని అన్వయించటంలో కవి కృతకృత్యుడయ్యారనే చెప్పాలి. బైబిలు ఆదికాండం మూడవ అధ్యాయంలో జ్ఞానఫలాన్ని తినొద్దని ఆదాముని దేవుడు ఆదేశించటం, అవ్వ ప్రోత్సాహంతో ఆ ఫలాన్ని తినటం, శాపానికి గురికావటం గురించిన కథ మనకి అందరికీ తెలిసిందే. 'విశ్వంభర' కావ్యంలో కూడా సినారె దాని మీద మానవుని చైతన్యాన్ని హేతుబద్ధంగా విశ్లేషణాత్మకంగా వర్ణించటం జరిగింది. అదే సంఘటనను మరింత ప్రతిభావంతంగా ఈ కావ్యంలో సమన్వయం చేయగలిగారు.

"ఇదిగో ఆ పండు తినకు-తింటే పాపం"

అది దివ్యస్వరం

దాన్ని ధిక్కరించిన ఆదిమ మానవుడు

ఆత్మజ్ఞుడేకాదు విశ్వజ్ఞుడయ్యాడు.

'ఇదిగో ఈ నీళ్ల అంటుకోరాదు - అంటుకుంటే నేరం'

అది కఠోర వర్ణదుశ్శాసనం.

ఆంక్షను ప్రతిఘటించిన అస్పృశ్యుడు

అభినవ శాసనకర్త అయ్యాడు" అని వర్ణించటంలో కవికి సమాజంలో జరిగే దారుణ వ్యవస్థపట్ల, దానికి వాళ్లలో రావల్సిన, వస్తున్న చైతన్యాన్ని పై కవితా ఖండిక ద్వారా దృశ్యీకరించటం జరిగింది. దేవుడినే ధిక్కరించిన మానవుడు, కొందరికే అనుకూలంగా సమాజంలో నిబంధించుకొన్న కొన్ని ఆంక్షల్ని, నియమాల్ని పెడితే వివేకశీలి వాటిని ఎంతకాలం సహించగలడు? భారతదేశంలో వర్ణవ్యవస్థ వల్ల, పాశ్చాత్య దేశాల్లో జాత్యహంకారం వల్ల ఎంతమంచి క్షోభకు గురైయ్యారో అనుభవించినవారికే కాదు, ఆ విషయం చూచాయగా తెల్సిన అందరికీ హృదయాన్ని ద్రవీభవింప జేస్తుంది. ఈ దుర్భరవ్యవస్థ కొంతమంది తమ ఆధిక్యతను ప్రదర్శించుకోవటానికి పన్నిన కుట్ర. మరి అటువంటి వ్యవస్థలో జీవిస్తున్న వాళ్ళు కొట్టిన బంతిలా తిరగబడకుండా ఎంతకాలమని ఉండగలరు? భారతదేశంలో దళితులు- పాశ్చాత్య దేశాల్లో ముఖ్యంగా అమెరికా, ఆఫ్రికా, ఇంగ్లండ్‌లలో జాత్యహంకారం, దాని ఫలితంగా వచ్చే తిరుగుబాట్లను తెలిపే యదార్థకథలెన్ని రాలేదు? స్పార్టకస్, లోశానీ, ఎలక్స్‌హిలీ రాసిన The Roots (ఏడుతరాలు)లో కాని చిత్రింపబడిన జీవితాలు బానిసవ్యవస్థ, ఆ బానిసలే చేసిన తిరుగుబాట్లు... ఇవి ప్రపంచమంతా ఉన్నాయి. కాకపోతే పేర్లు మార్చుకున్నాయి. వీటన్నింటినీ కవి దర్శించి రాసిన కావ్యమిది. నేడు దళితులు లేదా బానిసలు శాసనకర్తలు అవుతున్నారు. గాలీ, నీరు ప్రకృతిలోని వరాలు. వాటికి అంటరానితనం కల్పించటమేమిటి? అందుకే సినారె 'అది కఠోర వర్ణదుశ్శాసనం' అని ప్రయోగించారు. క్షేమేంద్రుడు "ఔచిత్య విచార చర్చ" చేస్తూ "ఔచిత్యం రస సిద్ధస్య స్థిరం కావ్య జీవితం" అని చెప్తాడు. అంతేకాకుండా "ఔచిత్యమనే జీవితం పదంలోనూ, వాక్యంలోనూ కూడా ఉండాలి" అంటాడు. ఇదంతా ఎందుకంటే 'సినారె' చక్కని ఔచిత్యాన్ని పాటించారని తెలియటానికే!

శ్రమజీవికి ఎక్కువ విలువనిచ్చే భాగాలు సినారె కావ్యంలో ఉండి కరుణరసం ప్రవహిస్తుంది. కావ్యమంతా మాత్రం కరుణరసం మాత్రమే లేదు. "ఎడారిలో మెడలు

సాచి నిలిచిన మేడలకు నాట్లు వేసింది చెమట చుక్కలే" పుట(1) అని శ్రామికులలో దైవత్వాన్ని చూడమంటారు కవి.

"మనలో మనతో శిరసెత్తుకుతిరిగే

భూమిపుత్రుల దళిత గాత్రాలు

ఇక్కడ పుట్టిన ఈ తొలిచూరు బిడ్డలు (43) అవి తన అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తారు కవి. ఉరిమే గొంతుకులై విచ్చుకోవటానికి వీరిని మట్టి బెడ్డలని విసిరికొట్టుటమే కారణమని చెప్తారు కవి.

"మనం తినే అన్న మూలం/ఆ చెమట కంపుదేనని మరిచిపోవద్దని" (93)లో హెచ్చరిస్తారు కవి.

కావ్యంలో ఆత్మ అని చెప్పదగిన

"మంటికీ మింటికీ మధ్య మనిషెందుకున్నట్టు

అల్లెతాటిని బిగించినట్టు

ఆ రెంటినీ కలిపేయటానికే" (పుట 15) అని విశదీకరిస్తారు కవి.

దీన్నిబట్టి కాలానికి ప్రతీకగా ఆకాశాన్ని తీసుకున్నట్టు తెలుస్తుంది. మార్పు సహజమని చెప్పే కాలతత్త్వాన్ని ఆవిష్కరించటం కావ్యంలో కన్పిస్తుంది. 'సముద్రం-ఆకాశం' సంభాషణలో ఆకాశం అసూయపడటం, రత్నగర్భగా సముద్రాన్ని వర్ణించటం జరిగింది.

కావ్యంలో తనదైన శైలిలో సందర్భానికి తగినట్లు రాస్తూనే విడివిడిగా కూడా స్వంత వ్యక్తిత్వాన్ని ప్రదర్శించగలిగే సత్యాన్ని వింగడించి చూపవచ్చు.

'ప్రలోభాలుండేవి ఆకట్టుకోవడానికే' పుట (3), "సృష్టికైనా దృష్టికైనా పరిణామం అనివార్యం" పుట (4), 'నిత్య సంచలనశీలికి నిద్రలో కూడా నిద్రపట్టదు, విహ్వలచిత్తానికి వికాసమన్నది ఉండదు." (4) 'అఖిల విశ్వానికి ప్రదీపశక్తి ఆశ' (13) స్మరణం వీరణం కావద్దు' (15) 'భ్రాంతి కలిగించే వెర్రితలలు కావు ఆశయాలంటే అవి వాస్తవాల జీవనదులు' (17) 'స్థలకాలాల మధ్య సజీవవారధి మనిషి' (30) సూర్యుడు ఉదయాస్తమయాల నిర్దేశకుడు' (32) 'అవయవాలు చస్తాయి గానీ ఆలోచనలు చావవు' (59) ఇలాంటి రత్నాలు ఎన్నో ఉన్నాయి.

ప్రపంచాన్ని రంగస్థలంగా మార్చుకొని మానవుడు ఆకాశాన్ని కిరీటంగా మలుచుకుని అందరిలో నూతన బింబాన్ని చూసుకుంటూ అందరి ఆశయాలనూ తనలో శ్రుతి చేసుకుంటూ నిత్యచైత్యంలో నిలిచే మనిషి, నిష్క్రమణంలేని పాత్రధారిగా ఎలా మారుతున్నాడో అవసరమైన చోట సంభాషణలతో కూడా చక్కగా వర్ణించబడిన కావ్యం

'మట్టి-మనిషి-ఆకాశం'. చివరకి అసలైన సుఖం మానవునికి దొరికేది నిర్వికార చిత్తంలోనే అని ధ్వనింపజేస్తుంది.

ఇది ఒక కాలానికో, దేశానికో చెందిన మానవ వికాస దర్శనం మాత్రమే కాదు, విశ్వమానవుని చైతన్యశక్తిని నిరూపించే కావ్యంగా అభివర్ణించవచ్చు. (నలభైరూపాయల వెల గల ఈ కవితా సంకలనం 'విశాలాంధ్ర' బుక్‌హౌస్‌లలో లభ్యమౌతుంది.)

*- ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక 6-3-98.*



# ఒక తాత్త్విక దర్శనం "కాలం మాయాజాలం"

**ఔషధం** మింగేటప్పుడు కష్టంగానే ఉండొచ్చు. కానీ అది ఇచ్చే ఫలితాలు ఎంత గొప్పవో తెలుసుకున్న తర్వాత దాని విలువ మరింత రెట్టింపవుతుంది. అలాగే సమాజానికి రుగ్మత పట్టినప్పుడు కూడా అనేకమంది వైద్యుల అవసరం ఏర్పడుతుంది. బాధ్యతతో కొంతమంది మాత్రమే నిజమైన ఔషధాన్ని అందిస్తారు. కవులు కూడా అటువంటివారే! ఒక కొత్త ట్రెండ్ వచ్చినంత మాత్రాన, దానివల్ల కీర్తిప్రతిష్టలు (తాత్కాలికంగా) పెరుగుతాయని తెలిసినప్పటికీ, తాము నమ్మిన 'సత్యాన్వేషణ' నుండి మనసు చలించ నివ్వని వారు కూడా ఎంతోమంది ఉంటారు. డాక్టర్ జె. బాపురెడ్డి గారు తమ తాత్త్విక దర్శనాన్ని ప్రదర్శించిన "కాలం మాయాజాలం" కవితా సంపుటి చూసిన తర్వాత నాకు కలిగిన భావన ఇది! షష్టిపూర్తి సందర్భంగా సరిగ్గా అరవై కవితలతోనే వెలువడిన కవితా సంపుటి ఇది. కవిగారే "ఆత్మశ్రుతి"లో చెప్పుకున్నట్టు అధిపతియైన కాలం ప్రదర్శించే సృష్టి, స్థితి, లయ లీలావిలాసం 'కాలం మాయాజాలం'. దీనిలో సమతాదర్శన సత్యసుందర సమాజ నిర్మాణానికి దోహదం చేసే కవితలెన్నో ఉన్నాయి. మానవ జీవిత పరమార్థాన్ని నిర్దేశించేవి, ఆత్మీయతతో నిండిన అభ్యుదయ మానవతా దృక్పథం అంతఃసూత్రంగా అల్లుకున్న కవితలు ఎన్నో మనసుకి విందు చేస్తున్నాయి.

'కాలం' తత్త్వాన్ని బాగా పట్టుకున్న బాపురెడ్డి గారు 'కాలం అన్ని రహస్యాలు చెబుతుంది / తన రహస్యం తప్ప / అన్ని హక్కులీ ప్రసాదిస్తుంది / తనను ఎదిరించే హక్కు తప్ప" అని దాని గుణాన్ని బహిర్గతం చేశారు. మానవ సమాజంలో ఉండే సంక్లిష్టతను, సంఘర్షణను సమన్వయించడంలో కృతకృత్యులైనట్లు కవితలే చెప్తున్నాయి. నక్సలిజం, దళిత, స్త్రీవాదాలు గురించి నిర్మాణాత్మక సూచనలు చేశారు. "అడిగినా అమ్మ అన్నం పెట్టదనే అపోహతో / అపాయం లేని ఉపాయం లేదనే ఆవేశంతో / అలిగిపోయి అడవిపాలైన / అజ్ఞాత సోదరులను / ఇంటికి తిరిగి రమ్మని పిలిచే / ప్రేమశీలి అనుభవశాలి ఉగాది" (35వ పుట.) అనటంలో కవి చర్చల ద్వారా శాంతియుత పరిష్కారాలు కనుక్కోవచ్చుననీ, హింసా పద్ధతులు ఆపమనే బోధన కన్పిస్తుంది.

స్త్రీ స్వేచ్ఛను అణచివేస్తున్న నేతిబీరకాయ నీతులు మారాలని చెప్తూ లైంగిక వివక్షతో ఉన్న పురుషాహంకారం పోగొట్టుకోవాలనీ అంటూ "స్త్రీకి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు

లేవని / విలపించేది స్త్రీవాదం / ఉన్నా ఉపయోగించుకోనీయని / పన్నాగాలను ప్రశ్నించేది స్త్రీ వాదం / అని కొత్త నిర్వచనాన్ని ప్రతిపాదించారు (135వ పుట) ఇది దీర్ఘకవిత. స్త్రీ-పురుషుల మధ్య ఉండవలసిన సంబంధాలు ఎంత దీర్ఘకాలికంగా కొనసాగాలో చక్కని శిల్ప నైపుణ్యాన్ని కూడా పాటించి రాసిన కవిత ఇది. ఎయిడ్స్ మహమ్మారి గురించి 'నీతిలేని రతి' (పుట 71) లో మరొక శిల్ప ఔన్నత్యాన్ని పాటించిన దీర్ఘ కవిత. ఈ కవితలో భార్యాభర్తల సుఖజీవనానికి, స్వలింగ రతికి, అక్రమ సంబంధమైన మైధున క్రియకు, వ్యభిచారానికి మధ్య ఎంత తేడా ఉందో వివరిస్తూనే, ఎయిడ్స్ మహమ్మారి పట్ల జాగ్రత్త వహించమనే హెచ్చరిక కన్పిస్తోంది.

"మనిషి దైవత్వాన్ని / దైవానికి మానవత్వాన్ని బోధిస్తూ / నింగికీ నేలకూ మధ్య బంధుత్వాన్ని సాధిస్తూ / 'ఆనందో బ్రహ్మ' సూత్రాన్ని / అందరికీ వర్తింపచేస్తూ / త్యాగయోగ భోగతంత్రుల మీద / అద్వైత రాగమూర్తిగా పాడుకుంటున్న / నా అక్షర భావనిజ శక్తిని దర్శించాను" అని కవి చెప్పుకున్న కవితలే ఇందులో ఎక్కువగా ఉన్నాయి. ప్రతి మనిషికి మహత్తరమైన శక్తి ఉందనీ, దాన్ని వెలికి తీయటానికి ప్రయత్నించాలనీ అప్పుడే వివేకానందుల వారు వచించిన 'భయరహిత' జీవితం సాధ్యమవుతుందనీ తన కవితా ప్రవాహాన్ని కొనసాగించారు బాపురెడ్డి!

ఎన్నో ముత్యాలను అక్షరాల వానగా కురిపించిన 'కాలం మాయాజాలం' ప్రత్యక్షంగా చూడగలిగిందే, స్వీయానుభవం పొందవల్సిందే!

- ఆంధ్రభూమి సాహితి పేజీ - జూలై 13.1998.



# చీకటికోణాల్ని వెలిగించిన స్త్రీవాద కవిత్వం

**గత** చరిత్రలో తమ ఉనికిని తామే మర్చిపోయి పురుషాధిక్య సమాజంలో బానిసలుగా బతికిన స్త్రీల కోసం స్త్రీవాదం బయలుదేరింది. పురుషులతోపాటు స్త్రీలకూ హక్కులున్నాయని, ఆ హక్కుల కోసం ఉద్యమాలు చేస్తూ ఆ అసమానతలను తొలగించటం కోసం విప్లవాత్మకమైన ఆలోచనలతో స్త్రీ వాదం ఒక అడుగు ముందుకువేసి తెలుగు సాహిత్య చరిత్రలో తన ప్రత్యేకతను చాటుకొంది. స్త్రీవాదం లిబరల్ ఫెమినిజమ్, రాడికల్ ఫెమినిజమ్, సోషలిస్ట్ ఫెమినిజం అనే మూడు ధోరణులతో బయలుదేరింది. ఒకప్రక్క జండర్‌కి సంబంధించిన విషయాలపైన, మరొకప్రక్క ఆర్థిక అసమానతలపై తిరుగుబాటు చేస్తూ స్త్రీవాదులు తమ నవలల్లోను, కథల్లోను, కవితల్లోను తమ తిరుగుబాటు బావుటాను ఎగురవేశారు. కవిత్వాన్ని పరిశీలిస్తే అందులోని భాగంగా 1993లో వెలువడిన 'నీలిమేఘాలు' (కవితా సంపుటి), విమల, 'అడవి ఉప్పొంగిన రాత్రి', జయప్రభ, 'వామనుడి మూడోపాదం', కొండేపూడి నిర్మల, 'నడిచే గాయాలు', ఈశ్వరి రాసిన 'ఈశ్వరి కోసం' మొదలైనవే కాకుండా ఆయా దిన, వార, మాస పత్రికల్లో వెలువడిన కవితల్లో నేటి స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యల్ని చిత్రించిన విధానం తెలుస్తుంది. ఘంటసాల నిర్మల 'ఎ కాల్‌గర్ల్ మోనోలాగ్' వంటి కళ్ళను పిండేసే కవితలు ఎన్నో వెలువడుతున్నాయి. "ఆకాశంలో సగం నీవు సగం నేను" అని అనుకున్నా మన సమాజంలో పురుషుల ఆధిపత్యం ఎక్కువగా కనపడుతూనే ఉంది.

అందుకే సుధ ఇలా అంటారు-

"ఎవరి యుద్ధం వాళ్ళే చేయాలి, నీ యుద్ధంలో నువ్వే గెలావాలి' అని! ఎవరి అస్తిత్వం కోసం వాళ్ళు పోరాడక తప్పదు.

నిజాలే మా కవితా వస్తువులని చాటిన స్త్రీవాద కవిత్వాన్ని విశ్లేషిస్తే ప్రధానంగా కొన్ని అంశాలుగా విభజించవచ్చు. అవి - 1. స్వేచ్ఛ కోసం తపించే కవితలు, 2. అణచివేత, 3. శ్రమదోపిడికి సంబంధించినవి, 4. జండర్‌కి సంబంధిచినవి, 5. పాతపడిన వ్యవస్థపై తిరుగుబాటు. ఇంకా అనేక రకాలుగా విభజించే వీలున్నా ప్రధానంగా కన్పించే అంశాలవి!

## స్వేచ్ఛకోసం తపించే కవితలు-

స్త్రీ స్వేచ్ఛని ఎలా అణచివేశరో సావిత్రి రాసిన 'బందిపోటు' కవిత స్పష్టం చేస్తుంది.

పెళ్ళంటే పెద్ద శిక్ష అని
మొగుడంటే స్వేచ్ఛా భక్షకుడని
మేం పాలిచ్చి పెంచిన జనంలో సగమే
మమ్మల్ని విభజించి పాలిస్తోందని'

చెప్తూ పెళ్ళి స్త్రీకి పెద్ద శిక్షలాంటిదని, తన స్వేచ్ఛను హరించటానికే భర్త జీవితంలో ప్రవేశిస్తున్నాడంటారు. ఆంధ్రజ్యోతి దినపత్రికలో ఎస్. జయరాసిన 'నీడలు'లో తన స్వేచ్ఛను అపహరించటానికి వెంటాడే వ్యక్తులు గురించి ప్రతీకాత్మకంగా రాసిన విధం చూడండి.

'నీడ చల్లని రక్షణ ఇస్తేనేమి?
బతుకు ఓడిపోయిన యుద్ధ ఖైదీ
మర్రి చెట్టు నీడలో మొక్క ఎదగదు
పేట్రియార్కీ! నువ్వొక మర్రిచెట్టువు
నువ్వొక తండ్రివి, నువ్వొక మొగుడివి!
నువ్వొక కొడుకువి!'

- ఈ కవితలో సామాజిక పరిశీలన హేతుబద్ధంగా ఉండటం గమనించవచ్చు. మర్రి చెట్టు నీడ అనటంలో నీడను అందిస్తున్నట్లు కన్పిస్తున్నా కింద ఎటువంటి మొక్కలను పెరగకుండా చేస్తుందనే శాస్త్రీయమైన విశ్లేషణ కవితలో కన్పిస్తుంది.

## అణచివేతని పలికించిన అక్షరాలు

కె.వరలక్ష్మి రాసిన 'శృంఖలాల్లోంచి' అనే కవితలో అణచివేత ఏ విధంగా సమాజంలో కన్పిస్తుందో చాలా స్పష్టంగా చూపించారు.

'అమ్మవై కూడా అమ్మవై ఏడుస్తున్నావా?
ఏం చెయ్యను తల్లీ!
ఎగిరొచ్చి నీ ముందు వాలాలనే ఉంది
ఎదకు నిన్ను హత్తుకొని ఊరడించాలనే ఉంది
ఎడాపెడా తగిలించుకున్న ఈ సంకెళ్ళు
నన్ను కదలనిస్తాయా?
కంటికి కనిపించవు గానీ
ఏనుగు గొలుసులంత బలమైన శృంఖలాలివి
ఏ అదృశ్యశక్తీ పడగొట్టలేని గోడలివి'

తాను కుటుంబ బాధ్యతలతో ఒకరకమైన అణచివేతకు గురై తన కుమార్తె కూడా మరలా అటువంటి అణచివేతకే గురవుతున్న వైనాన్ని ఈ కవితలో ఆత్మీయంగా వ్యక్తీకరించటం కన్పిస్తోంది.

విమల 'వంటిల్లు' మరొక అద్భుతమైన కవిత!

'ఎంత అమానుషమైంది ఈ వంటగది
వంటింటి సంస్కృతి వంటింటి ముచ్చట్లు
మన రక్తం పీల్చేసి మన
ఆశల్నీ కలల్ని కాజేసి
కొద్దికొద్దిగా జీవితాంతం పీక్కుతింటున్న
రాకాసి గద్ద ఈ వంటిల్లు'

బాల్యావస్థ నుండి వృద్ధాప్యం వరకూ స్త్రీకి వంటిల్లే విహార క్షేత్రంగా చేసే అణచివేతను ప్రశ్నించటం మనముందున్న సమస్యగా స్త్రీవాదులు భావిస్తున్నారనేది బహిర్గతమవుతుంది.

## శ్రమదోపిడీకి సంబంధించిన కవితలు

ఓల్గా రాసిన 'ఆకలే మిగిలింది' కవితలో -

'రెక్కలు ముక్కలు చేసుకొని
పొద్దస్తమానం ఎద్దులా పనిచేసి
ఈ భూమిని నా చెమటతో తడిపాను.
దూరంగా చెట్టుకింద ఉయ్యాలలో
ఆకలికి ఏడుస్తున్న బిడ్డకోసం
నా గుండెలో పొంగిన తల్లిపాలు
ఈ భూమిలోనే ఇంకిపోయాయి
చాకిరీ చేయలేక
సత్తువ బొత్తిగాలేక
ఆకలిని చంపలేకపోతుంటే
నా ఒంట్లో రక్తపు చుక్కలను
ఒక్కొక్కటిగా ఈ భూమి పీల్చివేసింది
అన్నిసార్లూ
ఈ భూమి బంగారమే పండింది
బంగారమంతా కామందు పెట్టెలోకి వెళ్ళింది
నాకు మాత్రం ఆకలే మిగిలింది!'

పురుషుడితో పాటుగా కూలీ చేస్తున్నా ఇచ్చే జీతంలో కూడా తేడాలున్నాయి. శ్రమకు తగిన ఫలితం దక్కక ఆకలికి ఏడుస్తున్న పసిబిడ్డకు కాసిన్ని పాలు ఇవ్వలేని దైన్యస్థితిలో కూడా కష్టించి పనిచేస్తే ఆ పనికి తగిన ఫలితాన్ని కామందు అనుభవిస్తున్నాడు కానీ. ఆ స్త్రీ కడుపు నిండటానికి పట్టెడు మెతుకులు దొరకటం లేదనీ, చివరకు ఆకలే మిగిలిందనీ కవయిత్రి పొడిపొడి పదాలతో కవిత కొనసాగించటం గొప్ప శిల్ప నైపుణ్యం!

మొక్కపాటి సుమతి రాసిన 'మిత్ర వైరుధ్యమా!' లో

'ఎవడూ అన్నది
ఇది మిత్ర వైరుధ్యమని
వర్గ శత్రువు నా బ్రతుకే దోచుకుంటాడు
వాడు నాకు కలలై నాకు కన్పిస్తాడు.
వీడు నా కలలన్నీ చెరిపేస్తాడు'

అనటంలో స్త్రీతోనే ఉంటూ కలిసి కాపురం చేస్తున్న నెపంతో కలల్ని కూడా చెరిపేస్తాడని ఇది మిత్ర వైరుధ్యమెలా అవుతుందని ప్రశ్నించటం కన్పిస్తుంది. కామందు స్త్రీ కష్టాన్ని మాత్రమే దోచుకుంటే వీడు సర్వస్వం దోచుకుంటూన్నడనే ఆవేదనని నిలువెల్లా ప్రవహిస్తుంది.

## జండర్‌కి సంబంధించిన కవితలు

స్త్రీవాద కవిత్వం వచ్చిన నాటి నుండి లింగ వివక్ష గురించి బాగా చర్చ జరిగింది. పితృస్వామ్య భావజాలం, మాతృస్వామిక భావజాలం అనే భావన విరివిగా ప్రచారం పొందాయి. దానిలో భాగంగానే 'లింగం' అనే పదానికి బదులు 'జండర్' అనే పదాన్ని స్త్రీవాదులు వాడటం విశేషంగా కన్పిస్తుంది. దాన్ని కేంద్రంగా చేసుకొని వెలువడిన కవితల్ని పరిశీలిస్తే స్త్రీవాద ధోరణుల్లోని మరిన్ని కొత్త విషయాలు బహిర్గతమవుతాయి. వాణీరంగారావు రాసిన 'తరతరాల శత్రువు'లో

'నేనిప్పటికీ ఎప్పుడో నా పేగులు
తెంచుకున్నప్పటి బాధని
తియ్యగా ఉందనుకుంటున్నాను
నా స్తన్యం పీలుస్తూ నువ్వు రక్కిన
గాయాల మచ్చల్ని
ఆనదంగా తడుముకుంటున్నాను
అవును!
నాకొక్కటి తెలీదు
వర్గ శత్రుత్వం చచ్చిపోలేదని!'

స్త్రీ పురుషుడిని నమ్మి తన్నుకొచ్చే బాధని కూడా దిగమ్రింగుకొని ఆ బాధలోనే ఆనందం ఉందనుకొని గాయాల మచ్చల్ని ఆనందంగా తడుముకుంటుంది. కానీ వర్గ శత్రుత్వం చచ్చిపోలేదని పాపం, ఆ తల్లికి తెలీదట! కొండేపూడి నిర్మల రాసిన 'లేబర్ రూమ్' కవిత జండర్ సమస్యని అద్భుతంగా చిత్రించిన కవితకు నిదర్శనంగా చెప్పవచ్చు. పిల్లల్ని స్త్రీలే కనవల్సి రావటం. దానికి స్త్రీలు పడే అస్తవ్యస్థ దుర్భర జీవితం జండర్ సమస్య కేంద్రంగా రాసిన కవితల ద్వారానే ప్రధానంగా తెలుస్తాయి.

## పాతబడిన వ్యవస్థపై తిరుగుబాటు కవితలు

సమాజంలో ఎన్నో కట్టుబాట్లకు లొంగి పురుషుడి చేతిలో కీలుబొమ్మలులా కాలం గడుపుతూ సంప్రదాయాల పేరుతో వంచింపబడిన స్త్రీలు భౌతిక పరదాల్ని విసురుతున్నారు. సమసమాజంలోకి అడుగువేస్తూ తమ అస్తిత్వాన్ని నిలుపుకోవటానికి ప్రయత్నిస్తున్న స్త్రీలు పాతబడిన వ్యవస్థ పైకి ఏ విధంగా సాహిత్యం ద్వారా తమ భావాల్ని వ్యక్తీకరిస్తున్నారో కుప్పిలి పద్మ రాసిన కవిత 'పాతరోత, జయప్రభ 'పైటను తగలెయ్యి' వంటి కవితలను పేర్కొనవచ్చు.

పరిశీలించాలి గానీ ఇంకా దిన, వార, మాసపత్రికల్లో నేను చూపిన అయిదు ప్రధానాంశాలతో ఎన్నో కవితలు వచ్చాయి, వస్తున్నాయి. స్త్రీవాదం వచ్చిన తర్వాత నుండి 'స్వేచ్ఛ' గురించి పితృస్వామ్య, మాతృస్వామ్య భావజాలం గురించి కొంత అవగాహన కలిగిందనేది నిస్సందేహంగా చెప్పవచ్చు. ఎంతోమంది అణచివేతకు గురవుతూ కూడా నోరు మూసుకుని పడి ఉన్నంతకాలం స్త్రీలపై పెత్తనం కొనసాగుతూనే ఉంటుందనేది స్త్రీవాద ఉద్యమాలు. స్త్రీవాద దృక్పథంతో వెలువడుతున్న రచనలవల్ల తెలుస్తున్న నిప్పులాంటి నిజాలు! కొన్ని దశాబ్దాలుగా దోపిడీకి గురైనా నోరు మెదపలేని స్త్రీలు చాపకింద నీరులా అక్షరాస్యత అల్లుకుని, విజ్ఞానాన్ని అందించటం ద్వారా, వార్తా పత్రికలు ఇచ్చే ప్రాధాన్యంవల్ల ఇపుడు తమ బాధల్ని, తమ సమస్యల్ని తామే వివిధ రకాలుగా వ్యక్తం చేస్తున్నారు. దానిలో భాగమైన రచనా వ్యాసంగంలో కవితలు బాగా ప్రేరణను కల్గించే సాహిత్య ప్రక్రియ. కవితలిన్నంటినీ పరిశీలించటం అసాధ్యం. కానీ మౌలిక విషయాల్ని చాలావరకూ సృజించగలిగాననుకుంటున్నాను. స్త్రీవాదంపై భిన్నభిన్న అభిప్రాయాలున్నప్పటికీ ఒక నాణానికి ఉన్న బొమ్మా బొరుసుల్లా మంచి చెడ్డలు రెండూ కలగల్సి ఉంటాయి. చర్చలకీ దారితీస్తాయి. అలా దారితీయటమే నిజమైన చైతన్యానికి నిదర్శనం. అపుడే మేలిమి బంగారం బయటపడి సత్యం బహిర్గతమవుతుంది. స్త్రీకి పురుషునికి ఎందులోనూ భేదం లేదనీ, జండర్‌తో వివక్ష మంచిది కాదని గమనించ బడుతోంది.

- ఆదివారం ఆంధ్రభూమి - ఆగస్టు 31, 1997.



# స్త్రీవాదేతర స్త్రీల కవిత్వం
## (1975-2000)

స్త్రీవాదం సాహిత్యంలో చేరకముందే 1960 నాటికే కందుకూరి వీరేశలింగం గారి సంఘసంస్కరణాభిలాషతో స్త్రీవిద్యకు శ్రీకారం చుట్టబడిన 'స్త్రీ సంస్కరణలు' స్త్రీల భవితవ్యం కోసం బయలుదేరి ఆనాటిస్త్రీలలో ఆలోచనాశక్తిని పెంపొందించాయి. సంప్రదాయం పేరుతో అణచబడుతున్న స్త్రీలు విద్యావంతులై తిరుగుబాటు ధోరణిని అలవర్చుకున్నారు. తమలో కలిగిన ఈ భావాలను తమ రచనలద్వారా తెలియజేయ డంతో ఆ రచనలకు విశేషమైన జనాదరణ లభించింది. అలా ప్రారంభమయిన రచయిత్రుల యుగం 1960-1980 వరకు సుమారు రెండు దశాబ్దాలు రచయిత్రుల యుగంగా ప్రాచుర్యం పొందింది. ఆ యుగంలో ఎందరో రచయిత్రులు స్త్రీవాద రచయిత్రులుగా ముద్రవేసుకోకపోయినా స్త్రీలు సమాజంలో పడుతున్నబాధలు వారు అనుభవించే మానసికక్షోభను, ఉద్యోగినులైన స్త్రీలు ఆఫీసుల్లో ఎదుర్కొనే సమస్యలు స్త్రీ స్వాతంత్ర్యం మార్క్సిజంతో ముడిపడి ఉందనే వాదనలతో తమ అణచివేతకు కారణాలైన ప్రతి అంశాన్ని కవిత్వం ద్వారా వ్యక్తీకరించడం జరిగింది.

స్వాతంత్ర్యానంతర తెలుగు కవిత్వంలో వచ్చిన వాదాల్లో స్త్రీవాదం ఒకటి. ఈ వాదం 1980 నాటికి బలమైన వాదంగా రూపుదిద్దుకుంది. ఈ వాదం సాహిత్యంలోను సమాజంలోను తెచ్చిన మార్పు సామాన్యమైంది కాదు. స్త్రీవాదం ఒకవైపు ఆధిక్యతను నిల్పుకుంటున్నా మరోవైపు స్త్రీవాదేతర స్త్రీలు కవిత్వాన్ని రాస్తూనే ఉన్నారు. స్త్రీవాదేతర స్త్రీలు రాసిన కవిత్వాన్ని పరిశీలించేటప్పుడు కొన్ని అంశాలను దృష్టిలో పెట్టుకోవలసిన అవసరం ఉంది. ప్రచురింపబడిన కవితా సంపుటాలను ఆధారంగా తీసుకున్నాను. 1975 నుండి 1999 వరకు అంటే ఈనాటికి రాస్తున్న రచయిత్రుల రచనలను ఈ వ్యాసంలో కొందరిని నేను విస్మరింపవచ్చు. అందుకు అన్యథా భావించవద్దు.

స్త్రీవాదేతర స్త్రీలలో ప్రముఖంగా పేర్కొనదగిన రచయిత్రి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ, తర్వాత డా॥ నాయని కృష్ణకుమారి, డా॥ శారదా అశోకవర్ధన్, శ్రీ సి. వేదవతి, డా॥ వాసా ప్రభావతి, శ్రీమతి శీలా సుభద్రా దేవి, డా॥ భార్గవీరావు, జ్యోతిరాణి, బి. కామాక్షి, డా॥ శరత్‌జ్యోత్స్నారాణి, చిల్లర భవానీ దేవి, మంత్రిప్రగడ శేషాబాయి, పి. సులోచనా సింహాద్రి, సి. జయశ్రీ సారథి, శైలజామిత్ర, మోహినీ ప్రసాద్‌లను పేర్కొనవచ్చు.

## కళాప్రపూర్ణ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ :

కన్యకమ్మ నివాళి, ఒక చిన్నదివ్వె, కాంతిశిఖరాలు, నా తెలుగు మాంచాల (1978) అనే రచనలు.

గీతాన్ని, పద్యాన్ని, వచనాన్ని ప్రధానంగా తీసుకొని రాసిన రచయిత్రి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ.

## డా॥ నాయని కృష్ణకుమారి.

తన కవిత్వాన్ని గురించి చెప్పదల్చుకున్న విషయాన్ని సూటిగా గుండెకు తగిలేటట్లు చెప్పడమే నాకిష్టం అంటారు.

అగ్నిపుత్రి 1978, ఏం చెప్పను నేస్తం 1988 (వచన కవితా సంపుటి) మానసలీల 1990 పద్యకావ్యం.

సమాజంలో మార్పు రావాలంటారు. ఆ మార్పుకోసం విప్లవాలను ఆహ్వానించే తత్త్వం ఆమెది కాదు. కవిత్వమంటే జీవితమనీ అనుభవాల తామరతంపర అని ఆమె విశ్వాసం. అగ్నిపుత్రిలో

నా కవిత
పలుకుతుంది
కసిని చంపుతుంది
నిరాశను తరిమికొడుతూ
భవిష్యత్తును దర్శిస్తుందంటారు

నా కవిత్వానికి ప్రధానమైన వస్తువు 'కన్నీళ్ళు' కాదంటారు. మనుష్యుల మీదనున్న మమకారం ఎంత ఉందో ఆమె కవితా సంపుటాలే నిదర్శనం.

"అరవిరసిన మొగ్గలోపల
మరంద నిష్యందంలాగా
నా కవితనిండా
మనుష్యులమీద మమత"

అగ్నిపుత్రి కావ్యాన్ని తండ్రిగారైన నాయని సుబ్బారావు గారికి, "ఏం చెప్పను నేస్తం" డాక్టరు శ్రీదేవికి అంకితమిచ్చారు. మానసలీల 'పద్యకావ్యం' ప్రౌఢపద్యరచన. స్త్రీ సమస్యలకు సంబంధించిన కవితలు ఈ రెండు సంపుటాలలో లేవు. 'అమ్మ ఒడి' కవితలో తెలుగువేల, మాతృదేశాన్ని గురించి వర్ణించిన తీరును గమనిద్దాం.

"నా జాతి చరిత్రలో గళ్ళులేవు
ఈర్ష్యల నెగళ్ళు లేవు
నా జాతి మనస్సులో పొరలు లేవు
ఆ అంతర్యం లోపల
మకిలితనపు అడ్డుతెరలు లేవు
తెలుగు నేల వెలుగు నేలగా తళతళలాడినచోట
అంతా చల్లనిజడి
అది మన అమ్మఒడి"

## శ్రీమతి శారదా అశోకవర్ధన్ :

శ్రీమతి శారదా అశోక వర్ధన్ కవితలు, కథలు, నవలలు, నాటికలు, వ్యాసాలు, గేయాలు - ఇలా అన్ని ప్రక్రియలలో సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన రచయిత్రి.

శారదాకృతులు, సుషుప్తి నుంచి మేలుకో, భావరాగిణి, సూర్య తిలకం, కాలం కడలిలో అనేవి కవితా సంపుటాలు. స్త్రీలు ఏకాలమైనా ఏ సమాజంలోనైనా ఎన్నో విధాలుగా అత్యాచార్యాలకు సంప్రదాయాలకు బలి అవుతున్నారని పేర్కొంటూ అటువంటి స్త్రీలకు సందేశమిస్తూ 'కాలంకడలిలో'ని పూర్ణమ్మలు కాకండి శీర్షికలో -

"నాడు కన్యాశుల్కం
కాలనాగై కాటేసింది
నేడు వరకట్నం విషపుగాటులు
గుప్పతోంది
పేరుమారిందే గాని
మారలేదు పరిస్థితి
ఆడవాళ్ళు బలిపశువుల్లా పడివుండకండి
పెళ్ళంటే కాదు
వ్యాపారమని చాటి చెప్పండి
చదువుకున్న వనితలు మీరు కూడా
పూర్ణమ్మలు కాకండి."

స్త్రీ లేనిదే ఈజగత్తు లేదని అసలు మహిలో ఉంది మహిళ అని మహోన్నతమైన వ్యక్తిత్వం కల స్త్రీని సమానంగా చూడలేని ఈ సమాజం ఏం ప్రగతిని సాధిస్తుందని,' అంటారు. మరో కవితలో మహిలో మహిళ -

మహిళలో వుంది మహిశబ్దం
ఆమెతో ఇమిడివుంది పూర్తి జగం
ఆగ్రహిస్తే ఆవేశమొస్తే
అపరకాళిలా అవతారమెత్తి
కదను తొక్కగలదు
కత్తి దూయగలదు
ఎంత చేసినా, ఏం చేసినా
సమానత్వాన్ని సంపాదించలేకపోతుంది.

## డా॥ వాసా ప్రభావతి :

అభ్యుదయభావాలు కలిగిన రచయిత్రి, కవయిత్రి డా॥ వాసా ప్రభావతి, అమ్మ (1980), జగతి ప్రగతి (1982), ఆలాపన (1983), మంజీరనాదాలు, నా హృదయనేత్రం (1994), మళ్ళీ పుడతా, స్వర్ణభారతి (1998), వంటి కవితా సంపుటాలతోపాటు నాటకాలు, వ్యాసాలు, కథలు కూడా రాసిన విదుషీమణి.

స్త్రీ అంటే ఆమెకు గౌరవం. కేవలం స్త్రీగా పుట్టినందుకు కాదు. మెత్తని మనసున్న స్త్రీలపై అనుక్షణం కత్తుల్లా దూసుకొస్తున్న అత్యాచారాలను ఎలుగెత్తి చాటడమే కాదు, ఆ సమస్యలను తన కవితా సంపుటాలలో వ్యక్తీకరించడం ప్రధానంగా కన్పిస్తుంది.

"భావాలకు రెక్కలు
విప్పేది అమ్మ
చివరకు తండ్రినికూడా
పరిచయం చేసేది అమ్మ"

స్త్రీవాద కవిత్వానికి దగ్గరగా పై కవిత ఉంది.

మంజీర నాదాలలో కవితను గమనిద్దాం.

"కాంతను చూడగానే కన్నుగీటే
కామాంధులకు కారుచిచ్చును నేను
ఆడవారంటే ఆటబొమ్మలనుకునే
వారికి తోకచుక్కను నేను
ఆడువారి అభ్యుదయాన్ని చూసి
అసూయపడే కళ్ళకు ముల్లును నేను."

స్త్రీలలో కన్పిస్తున్న ఆత్మవిశ్వాసం గురించి మరో కవిత -

"ఈ నేలంతా నీ అడుగు జాడలే
తల్లి కడుపులో బలికాని ఆడశిశువునై
వరకట్నానికి బలికాని వధువునై
విద్యనేర్చిన వివేకవతినై
చట్టాలను సవరించి, అన్యాయాన్ని ఉరితీసి
దేశంలో కొత్త సంస్కారం విరజిమ్మాలనివుంది
పూర్ణమ్మ 'స్నేహలతా' దేవిల్లా
నన్ను బలికానివ్వ కండి

"మధ్యలో నాకు నడవాలని ఉంది" అని అనడంలో స్త్రీవాద రచయిత్రిగా ముద్ర వేసుకోకపోయినా స్త్రీ మూర్తిమత్వాన్ని వర్ణిస్తారు.

**శ్రీమతి సి. వేదవతి :**

ఈమె రచించిన వచన, గేయ, కథా కవితల సంపుటి 'సరళి'

స్త్రీత్వపు విలువలను తెలియపరుస్తూ - "మా వాళ్ళు" కవితలో -

"నేను పుట్టిన దేశంలో
రాజ్యాలు ఏలిన రాణులున్నారు
రాళ్ళల్లే బ్రతికిన రమణులున్నారు
అసిధారపై అడుగులు
అలవోకగా వేయనేర్చినవాళ్లు
మా ఇళ్ళ ఆడపడుచులు
సమస్యలే తొలిశ్వాసగా
ఊపిరితీయ నేర్చినవాళ్ళు
వాళ్ళు కరిగి వెలిగే కర్పూరకళికలు
క్షణ ప్రభాజ్వలిత హారతులు
కర్మవీరం ఒకచేత
కసువు ఊడ్పులు ఒకచేత
ఊయెల ఊపులు ఒకచేత
ఉద్యోగపు ఊడిగం ఒకచేత
రేయీపగలు శ్రమ జీవనసరాలు
స్త్రీత్వపు విలువకు సరికొత్త సవాళ్ళు"

స్త్రీల బ్రతకు భయంతోనే స్త్రీపర్వం సాగుతుందని మరో కవిత -

"ఆమె ఆమెగానే పొగిలిపోయింది
ఆమె ఆమెగానే రగిలి పోయింది
జీవనమహతి మ్రోగుతూనే వుంది
కుత్తుకబంటిలా హాలాహలం
గుండెల నిండుగా దావానలం
వదనంలో వసంతాలు
కన్నుల్లో కారుణ్యం
మహిళారూప మహతి ఆమె
నిత్యదుఃఖిత నిరత పీడిత"

## శ్రీమతి శీలా సుభద్రాదేవి

ఈమె ఆకలి నృత్యం 1980, ఆవిష్కారం 1996, తెగిన పేగు 1994, స్త్రీని చిన్న చూపుతో చూసే ఈ సమాజంలో స్త్రీని స్త్రీగా గౌరవించండని అంటారు -

"నన్ను ఆడదాన్నని అనకు
నేను ఎక్కడదాన్ని కావాలనుకోవటం లేదు
అంతటా నిండి వుండేదాన్ని
నన్ను నన్నుగానే చూడు
సంపూర్ణమైన వ్యక్తిగా మాత్రమే గుర్తించు
నన్ను నారీ అని మురిపించకు
ఆదర్శాల కిరీటం ధరించి
శిరోభారంతో నీముందు
తలవంచుకు నిల్చోలేను."

## శ్రీమతి భార్గవీరావు

ఈమె నీడల గోడలు, ఆల్బమ్ వంటి కవితాసంపుటాలను మొనరించారు.

స్త్రీగా ఎందుకుపుట్టావు? ఈ పురుష సమాజంలో స్త్రీగా ఎలా బలి అవుతున్నావు? స్త్రీ శక్తిని గుర్తించే సమాజంలో స్త్రీగా పుడితే ఎంతబాగుంటుందనే భావనను తెలియజేస్తూ ఆల్బమ్ కవితా సంపుటిలో 'కొంచెం ఆగు' శీర్షికలో-

"అప్పుడే పుట్టకు
కొంచెం ఆగు

ఈ జనానికి నీ విలువ
తెలిసిరానీ
మగజాతికి నీవులేని
మనుగడ ఎలా వుంటుందో
కొంచెం రుచి చూపించు
పుట్టగొడుగుల్లాంటి
పురుష సమాజం
నిన్నందుకోలేక, నీ సాటిరాక
వాళ్ళల్లో వాళ్ళు
సుందోపసుందుల్లా కుమ్ముకుని
సృష్టికార్యం ఆగిపోయి
ప్రళయం ముంచుకొచ్చేటప్పుడు
దుర్గలా పుడుదువుగాని
స్త్రీశక్తికి నివాళులిచ్చే
సమాజం పుడుతుంది
అంతవరకు అప్పుడే పుట్టకు"

## జ్యోతిరాణి

ఈమె రాసిన కవితా సంపుటి "మధు జ్వాల" 1993 ఉత్తమ గుణాలు కలిగిన స్త్రీ 'తానేమిటో' నిరూపించుకుంటుంది. స్త్రీ చీకటిని తరిమే వెలుగు కిరణం. ఇంతకూ "నేనెవరిని" అనే కవితలో ప్రశ్నిస్తూ :

"అబలను నేనా! సబలనని
నిరూపించుకోలేనా?
ఆపదలకు జడిసానా?
మానవతను మరిచానా?
నాటికి, నేటికి, ఏనాటికి
నేను ఆరనిజ్యోతిని
తిమిరాలను తరిమే ఇనకిరణాన్ని
తేజోమయి ప్రభావపుంజాన్ని
ప్రమదల్లో ప్రమిదనై
కారుచీకట్లను తరుముతున్నాను
అరవై కోట్ల కంఠాలతో
విజయ శంఖం ఊదుతున్నాను"

## డా॥ ఎస్. శరత్ జ్యోత్స్నారాణి

ఈమె రాసిన కవితా సంపుటి 'కొత్తపాట'. ఈమె రాసిన కథలు వెన్నెల పేరుతో ఆంధ్రభూమిలో ప్రచురింపబడ్డాయి. ఆడపిల్లలను అంతం చేసే సంస్కృతిని నిరసిస్తూ తన కవితల్ని రాసారు. స్త్రీ తనకు పుట్టబోయే బిడ్డ ఆడబిడ్డని తెలుసుకుంటూ మమకారం ఉన్నప్పటికీ తనపై పెత్తనం సాగించే కుటుంబానికి భయపడి మనోధైర్యాన్ని కోల్పోయి శిశుహత్యకు సిద్ధపడుతుందని, అటువంటి స్త్రీ అడుగుముందుకు వెయ్యాల్సిన అవసరం ఉందని కొత్తపాటలో 'ముందడుగు' శీర్షికలో -

"అరక్షణం నిలువలేదు
అమ్మనయ్యాననే ఆనందం
అందమైన తన స్వప్నం
అలల సుడిగుండాల మధ్య
చిత్రమైన చిత్తరువూ
ముక్కలై
బ్రతుకు ఇంతలో
బరువై పోతుందని
మూడుముళ్ళ మురిపెం
మూడు నెలలేనని
కడుపులో కదిలే
నెత్తుటి ముద్ద
తన్నో ముద్దాయిని చేసి
నిలదీస్తూంటే
ఎప్పుడో చదివిన
అబలల కన్నీళ్ళ కథలు
తళుక్కున మెరిసి
పెళ్ళి, తాళి
రక్షక కవచాలు కావని
కాసులతో కన్నీళ్ళతో
కాలాన్ని నెట్టుకొస్తున్న
పాతతరం స్త్రీ జాతికి చెందనని
ఆడపిల్లకు తల్లినవ్వాలనే కాంక్షతో
అమ్మతనాన్ని లోకానికి చాటడానికి
నేటి మహిళ
మరో అడుగు ముందుకేస్తోంది."

చిల్లర భవానీ దేవి 'శబ్దస్పర్శ', శ్రీమతి ఎన్.ఉమాదేవి భావస్పందన, శ్రీమతి బి. కామాక్షి 'మానవవంశి' 1996, మంత్రిప్రగడ శేషాబాయి "కనిపించని దేవుడు" 1993, పి. సులోచనా సింహాద్రి "మధుబిందువులు" 1993, శ్రీమతి సి. జయశ్రీ సారథి 'నీరాజనం' 1987, శ్రీమతి శైలజామిత్ర "మనోనేత్రం" 1999, మోహినీప్రసాద్ "వజ్రఖడ్గం" వంటి ప్రముఖ స్త్రీవాదేతర స్త్రీల రచనలను పరిశీలించినపుడు 'అనుభవాలే స్త్రీవాదం' అని అంటున్న స్త్రీవాద రచయిత్రులతో సమానంగా స్త్రీల సమస్యలకు స్పందిస్తూ వారి అనుభవాల లోతుల్లోంచి, స్త్రీని గమనిస్తూ, విభిన్న ధోరణులతో కవిత్వాన్ని ఆవిష్కరించారు. పై రచయిత్రుల రచనల్లో కన్పించే స్త్రీని ప్రధానంగా తీసుకుని ఈ వ్యాసాన్ని రూపొందించాను.

- వాఙ్మయి-2000



# తెలుగు నవల - దళితవాద స్పృహ

ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్నవాదాలు, ధోరణులు చోటు చేసుకున్నట్లే, రెండు దశాబ్దాలపాటు దళితవాదం తనదైన ప్రత్యేకతను చాటుకుంటూంది. దళితవాదం సాహిత్యంలో ప్రాముఖ్యతను సంతరించుకోవడానికి ప్రధాన కారణం దళిత ఉద్యమాలు. దళిత ఉద్యమాలు రావడానికి ప్రధాన కారణం దళితేతరుల దాడులేనని చెప్పవచ్చు. ఈ సాహిత్యాన్ని దళితులే సృష్టించడం కూడ నూతన పరిణామంగా భావించవలసి ఉంది. ఎందుకంటే, కొన్ని శతాబ్దాలుగా అన్ని రంగాలకు దూరంగా విసిరివేయబడ్డ దళితులు తమలో కలిగిన చైతన్యాన్ని అన్ని రంగాలలో చూపించడం కన్పిస్తుంది. అంతేకాకుండా దళితుల వికాసానికి దేశంలో అన్ని రాష్ట్రాలలోను ఉన్న మేధావుల కృషిని కొంతవరకు వివరించవలసి ఉంది. దళితులను విద్యావంతులుగా తీర్చిదిద్దడానికి కృషి చేసిన వారిలో ప్రథములుగా చెప్పుకోవలసిన వ్యక్తి జ్యోతిబా పూలే. అయితే దళితులను జాగృతిపర్చి వారిలో ఆత్మగౌరవాన్ని కలిగించడం కోసం శ్రమించిన మేధావి డా॥ బి.ఆర్. అంబేద్కరు. వీరిరువురి కృషివల్ల దళితుల్లో చైతన్యం కల్గింది. దళితుల్లో సామాజిక స్పృహ కలగడానికి గల కారణాలను ముందుగా తెలుసుకోవడం చాలా అవసరం. 1968 సం॥లో కంచికచర్ల కోటేసు సజీవ దహనం దళితుల ఆలోచనకు పునాదిగా భావించవచ్చు. తర్వాత 1985 సం॥ జూలై నెలలో కారంచేడు, చుండూరు ప్రాంతాలలో జరిగిన హత్యాకాండలతో దళితవాదం తీవ్రరూపం దాల్చింది. దానికితోడు మండల్ కమిషన్ నివేదిక అమలుకు వ్యతిరేకంగా అగ్రవర్ణాలు చేసిన ప్రదర్శనలు 'శ్రమజీవనాన్ని శారీరక శ్రమను కించపరుస్తూ అగ్రవర్ణాలు చూపిన నిరసన రూపాలు' దళిత చైతన్యాన్ని మరింత ప్రజ్వలింపజేశాయి. 1874లో సత్యశోధక్ సమాజ్ ద్వారా దళితులను చైతన్యపరచిన బాపూలే అడుగుల్లో ఎందరో నాయకులు ముందుకు వచ్చారు. అటువంటివారిలో శివరామ్ కాంబ్లె, కర్మవీర్ హిందే, నారాయణ్ చందావర్కర్ లను పేర్కొనవచ్చును. శివరామ్ కాంబ్లె 1910లో నిమ్నజాతుల వారి మహా సభను ఏర్పాటుచేశాడు. కర్మవీర్ హింద్ దళితుల సేవా సంఘాన్ని స్థాపించాడు. దళితుల అభివృద్ధి కోసం కలకత్తా కాంగ్రెస్ 1917లో ఒక సమావేశం జరిపి, దళితులు అభివృద్ధికి కృషి చేసింది.

మొదటిసారిగా బొంబాయిలో అఖిల భారత దళితజాతుల సమావేశాలను నిర్వహించి, దళితుల ఉనికిని గుర్తిస్తూ బ్రిటిష్ ప్రభుత్వం ఒక దళిత ప్రతినిధికి అవకాశం కల్పించింది. తిరిగి మరల 1924లో డా॥ అంబేద్కర్ అస్పృశ్యతా నివారణోద్యమాన్ని

మొదలుపెట్టి, బొంబాయిలో దళిత సమావేశాన్ని ఏర్పాటు చేశారు. డా॥ బి.ఆర్. అంబేద్కర్ శూద్రులంటే ఎవరు? కుల నిర్మూలన, భారతదేశంలో కులాలు, రాముడు ఆదర్శపురుషుడా? వంటి అంశాలపై రచనలు చేసి, దళితుల్లో చైతన్యం రావటానికి ఎంతగానో పాటుపడ్డారు. ఈ విధంగా అంబేద్కర్ రచనలు ఒకప్రక్క, వివిధ భాషల్లో ప్రచురింపబడిన ప్రబుద్ధ భారత్, అస్మిత, భీంపత్రిక, జనతా, నికాయ, సింహగర్జన, ప్రమేయ వంటి పత్రికలు దళితుల చైతన్యానికి ఎంతగానో తోడ్పడ్డాయి. ఈ విధంగా అంబేద్కర్ ప్రభావంతోపాటు కారల్ మార్క్స్, మావోల సిద్ధాంతాలు, నీగ్రో సాహిత్యం లోని తిరుగుబాటు తత్త్వం - వీరిలో నూతన చైతన్యవికాసానికి మార్గాలు వేశాయి. చైతన్యవంతులైన దళితులను ప్రోత్సహించడానికి, దళిత మేధావులు 1984 సం॥ ఆగస్టు 18న ఢిల్లీలో భారతీయ దళిత సాహిత్య అకాడమీని స్థాపించి, ప్రతి సంవత్సరం అంబేద్కర్ పేరిట జాతీయ, అంతర్జాతీయ అవార్డులను ఇస్తూంది.

ఆనాటి సాహిత్యంలో దళిత పదాన్ని ప్రయోగించకపోయినా పంచమ, హరిజన, అస్పృశ్యత వంటి పదాలతోనే సాహిత్యం కొనసాగింది. అటువంటి కాలంలో సంఘ సంస్కరణ పేరుతో వెలువడిన సాహిత్యానికి శ్రీకారం చుట్టిన వారిలో గుర్రం జాషువా, కుసుమ ధర్మన్న, నూతక్కి, అబ్రహాం వంటి కవులను ప్రముఖంగా పేర్కొవచ్చు. దళితవాదం పేరుతో రాస్తున్న కవులు సతీష్ చందర్, కత్తి పద్మారావు, ఎండ్లూరి సుధాకర్, కొలకలూరి ఇనాక్, శిఖామణి, బోయ జంగయ్య ప్రభృతులను పేర్కొనవచ్చు.

దళితవాదం తెలుగు సాహిత్యంలో ప్రధాన స్థానాన్ని పొందక పూర్వమే ఆనాటి సమాజంలో ప్రధాన సమస్యగా కన్పిస్తున్న దళిత సమస్యలకు స్పందించి నవల, కథ, కవిత్వం వంటి ప్రక్రియల్లో రచనలు చేసిన కవులు, రచయితలు ఎందరో ఉన్నారు. అయితే దళితవాదంలో కవిత్వం, కథలు వచ్చినంత విస్తృతంగా నవలలు రాలేదని చెప్పవచ్చు. ముల్క్‌రాజ్ ఆనంద్ రాసిన 'అన్‌టచ్‌బుల్' నవల తొలి భారతీయ నవలని చెప్పాలి. దళితేతరులు రాసిన దళిత నవలలు తెలుగు సాహిత్యంలో 1913 నుండి వెలుగు చూశాయి. తల్లాప్రగడ సూర్యనారాయణరావు రాసిన 'హేలవతి' (1913), వెంకట పార్వతీశకవుల 'మాతృమందిరం' (1919), ఉన్నవ లక్ష్మీనారాయణ 'మాలపల్లి' (1922), వట్టికోట ఆళ్వార్ స్వామి 'ప్రజల మనిషి' (1955), అడవి బాపిరాజు 'నరుడు' (1946). రంగనాయకులు 'హరిజన నాయకుడు', ముప్పాళ రంగనాయకమ్మ 'బలిపీఠం' (1962), మహీధర రామ్మోహనరావు 'కొల్లాయిగట్టితేనేమి?' మల్లాది వసుంధర 'త్రివర్ణపతాక' (1965), దాశరథి రంగాచార్య 'చిల్లర దేవుళ్ళు' (1970) కేశవరెడ్డి 'బానిసలు', 'శ్మశానం దున్నేరు', 'ఇన్‌క్రెడిబుల్ గాడెస్' (1979), వాచస్పతి 'అంతస్తులు-అంతఃకరణాలు' (1965), ఇల్లిందల సరస్వతీ దేవి 'నీ బాంచెను కాల్మొక్కుతా' (1976), రంగనాయకులు 'మల్లికలు' ప్రముఖ దళిత నవలలు.

ఉన్నవ లక్ష్మీనారాయణ రాసిన నవల మాలపల్లి నుంచి 2000 సం॥లో వెలువడిన జి. కల్యాణరావు నవల అంటరాని వసంతం వరకు పరిశీలిస్తే అంటరానితనం లేదా దళితత్వం యొక్క విశ్వరూపం సమాజంలో ఎలా ఉందో గమనించవచ్చు. దళితేతరులు రాసిన నవలల్లో దళితుల సమస్యలను స్పృశిస్తూ కన్పించిన అంశాలుంటాయి. కాని దళితులే రాసిన నవలల్లో వారు జీవితంలో అనుభవించిన సుఖదుఃఖాలు, అవమానాలు, ఆకలి, ఆవేదనలకు సంబంధించిన వివిధాంశాలు కళ్ళకు కట్టినట్లు చిత్రించడం కన్పిస్తుంది.

ఖాకీ బ్రతుకులు, పంచమం, కక్క, అద్దంలో చందమామ, అంటరాని వసంతం వంటి నవలలు దళిత రచయితలు రాసినవే. తెలుగు నవలల్లో (దళిత, దళితేతర రచయితలు రాసిన నవలల్లో) దళిత స్పృహ ఎక్కువగానే ఉంది. అన్ని నవలలను చర్చించడానికి స్థలాభావంవల్ల ప్రముఖమైన కొన్ని నవలలను మాత్రమే చర్చిస్తాను. స్వాతంత్ర్యానికి పూర్వం వచ్చిన ప్రథమ రాజకీయ నవల మాలపల్లి. స్వాతంత్ర్యం వచ్చి ఏభై సంవత్సరాలు దాటినా స్వర్ణభారతంలో ఇంకా ఈనాటికీ అస్పృశ్యతను చూపిస్తూ ఆ సమస్యలను చర్చిస్తూ వెలువడిన నవల 'అంటరాని వసంతం.' 1913 నుంచి 2000 వరకు సమాజంలో మార్పు కన్పిస్తున్నట్లు ఉన్నా ఆ మార్పు విస్తృతంగా లేదని పై నవలలు చాటుతున్నాయి.

## మాలపల్లి :

మాలపల్లి హరిజనులనే నాయక పాత్రలుగా చేసి రాసిన నవల. ప్రధానమైన సమస్య హరిజనుల సమస్య. ప్రధాన పాత్రలైన రాందాసు, సంగదాసు, వెంకటదాసు, జ్యోతి ప్రభృతులెవ్వరు సాధారణ హరిజనులు అనుభవించే సమస్యలను ఎదుర్కోలేదు. అందువల్ల ఈ పాత్రలు ఉదాత్తంగా చిత్రింపబడడమే కన్పిస్తుంది. జైళ్ళల్లోను, సెటిల్‌మెంట్స్‌లో ఆ కుటుంబానికి ఎదురైన కష్టాలు కేవలం హరిజనులకి మాత్రమే ఎదురయ్యేవి కావు. ఆనాడు జైలుకువెళ్ళిన స్వాతంత్ర్యవీరులందరు అలాంటి కష్టాలనే ఎదుర్కొన్నారు. ఈ నవల గాంధీ మార్గానికి, విప్లవ మార్గానికి విచిత్రమైన సమన్వయం సాధించడం కన్పిస్తుంది. ఆనాటి సమాజంలోని దురాచారాలను పారద్రోలి సంఘాన్ని ప్రగతి మార్గంలో నడిపించటానికి కృషి చేసిన సంగదాసు, అకాల మరణానికి గురైనా, అతడు ప్రబోధించిన చైతన్యం సంఘంలో సుస్థిరమై, చివరకు సంఘ పీఠాన్ని స్థాపించింది. ఉన్నవవారు ఈ నవలకు సంగ విజయమని పేరు పెట్టారు. ఆనాటి భారత సమాజం సాధించిన విజయం అని అర్థం. ఈ నవల్లోని ప్రధాన ప్రతి నాయకుని పాత్రధారి చౌదరి - సంగమదాసుని కొట్టి చంపించడం - కేవలం సంగదాసుపై కోపం అని మనం భావించడానికి వీలులేదు. చౌదరికి నమ్మకస్థుడైన సేవకుడు సంగదాసు. చౌదరి కొడుకు

రామనాయుడు. సంగదాసుతో స్నేహం చేసి చెడిపోతున్నందుకు లోలోపల వ్యధ చెందుతాడు. కాని కులం పట్టింపులు చౌదరికి లేవు.

వాడుక ప్రకారం ధాన్యం బదులు డబ్బులు ఇస్తానంటాడు చౌదరి. కాని సంగదాసు ధాన్యాన్నే కావాలని పట్టుపడతాడు. కొత్తవారిని పనిలో తీసుకుంటాడు చౌదరి. వారు పనిలోకి రాకుండా చేస్తాడు. చౌదరిని ఎదిరిస్తాడు సంగదాసు. అందువల్ల సంగదాసుపై గల కోపంతో చౌదరి సంగదాసుని కొట్టిస్తాడు. చివరకు సంగదాసు మరణిస్తాడు.

తక్కెళ్ళ జగ్గడు - విప్లవ వీరుడు. అణచబడ్డ దళితుని ఆక్రోశం ఏ విధంగా ఉంటుందో మనకు ఈ పాత్ర ద్వారా తెలుస్తుంది. రాందాసు వేదాంతాన్ని బోధించడం - అక్కడున్న వాళ్ళంతా వినడానికి రావడం, అతడ్ని ఆహ్వానించడం, సంఘర్షణ లేకుండా రామనాయుడు జైల్లో ఉన్న రాందాసుని విడిపించడం, సంగపీఠాన్ని స్థాపించి దానికి రామదాసుని కులపతిని చేయడం ఈ నవల్లో కన్పిస్తుంది.

జ్యోతి హరిజన స్త్రీగా పడిన వేదన, ఆవేదన ఈ నవల్లో కన్పించదు. జ్యోతి రైతుబిడ్డగా కన్పిస్తుంది. అంతేకాదు. జ్యోతిని రైతుబిడ్డగా ప్రత్యేకంగా చెప్పడం కూడా విశేషమే. 'బ్రాహ్మణుల అమ్మాయి కమలకంటే ఉత్తమురాలు జ్యోతి' అని చెప్పడం విశేషం. ఈ నవల్లో రామదాసు సాంస్కృతిక విప్లవానికి, సంగదాసు రాజకీయ ఉద్యమానికి, తక్కెళ్ళ జగ్గడు విప్లవానికి ప్రతీకలుగా కన్పిస్తారు. ఈ నవల్లో ముఖ్యంగా హరిజనులు అగ్రవర్ణాల వారి దౌష్ట్యానికి బలైపోతున్న వైనం అడుగడుగునా కన్పించక పోయిన అప్పదాసు తల్లి సుబ్బలక్ష్మి పాత్ర ద్వారా హరిజనులను భూకామందులు ఎంత దారుణంగా హింసించారో చూపించారు. ఉదాహరణగా, గట్టు మీద ఏరుకుంటున్న సుబ్బలక్ష్మి మోచేతిమీద కర్రతో కొడతాడు భూ కామందు. ఆమె చెయ్యి వాచి పుండై కొన్ని నెలలు బాధపడుతుంది. మరొక అంశం - హరిజనులకు దేవాలయ ప్రవేశం లేకపోవడం. ఈ అంశాన్ని నవల్లో చర్చించడం కన్పిస్తుంది. సంగదాసు తన ఉపన్యాసంలో 'అర్థ విజ్ఞానం అందరి సొమ్ము' అని ప్రబోధిస్తాడు. హరిజనుడే ఆది ఆంధ్రుడని కూడా సంగదాసు నిరూపిస్తాడు. వారి అసమర్థతను, అసహాయతను, అమాయకత్వాన్ని అవకాశంగా తీసుకొని హరిజనులను మోసం చేయడమే కాకుండా దోచుకోవడం ద్వారా రాజకీయ నాయకులు తాము నడిపే రాజకీయాలకు వారిని పాత్రలుగా వాడుకోవడం వంటి అంశాలు ఈ నవల్లో చూపించారు ఉన్నవ లక్ష్మీనారాయణ.

## బలిపీఠం :

ముప్పాళ రంగనాయకమ్మ అగ్ర వర్ణానికి చెందిన నాయిక అడుగు వర్గానికి చెందిన హరిజన యువకుడ్ని. వివాహం చేసుకోవడం ఆ తర్వాత వారి జీవితాల్లో ఎదురైన అనేక సమస్యలను కళ్ళకు కట్టినట్లు చిత్రించారు.

## వీరవల్లడు :

విశ్వనాథ సత్యనారాయణ 'వీర వల్లడు' నవల రాశారు. ధార్మికుడైన దొర వద్ద పనిచేసే హరిజన పాలేరు వల్లడు. అతని ఔదార్యానికి ప్రభావితుడై దొరలా జీవితాన్ని సాగించాలని అనుకుంటాడు. ఈ నవల్లో వీర వల్లడు దొరకు ప్రతినిధిగా కన్పిస్తాడు. దొర మరణంతో పాలివాడైన రాయుడి దౌష్ట్యానికి గురైన దొర కుటుంబాన్ని ఆదుకుంటాడు. ఈ నవల్లో ఒక చోట - 'రాయుణ్ణి సాధిస్తా. మళ్ళీ నా దొర ఇంట్లో దీపం పెడతా' నంటాడు - వీరవల్లడి త్యాగనిరతి మనలను ముగ్ధులను చేస్తుంది. మరోచోట 'కులాల భేదాలే కాని మేమిద్దరం చుట్టాలవలె ఉండేవాళ్ళం. మా దొర మనస్సు బంగారం. చదువెందుకు, 'బుద్ధి కావాలి' అని అంటాడు. మనిషికి కులం కాదు, మానవత్వం ప్రధానమని వీరవల్లని పాత్ర ద్వారా ఆనాటి దళిత సమస్యని చూపించిన విశ్వనాథ కులాలు ఉండకూడదు, మనిషికి మనిషికి మధ్య మానవత్వం ప్రధానంగా ఉండాలని ప్రబోధించారు.

## అద్దంలో చందమామ :

దీనిని చిలుకూరి దేవపుత్ర రాసారు. భూ పరిమితి ఏర్పడటం, తిప్పేస్వామి ధర్మయిల దగ్గర మించిన భూములను ప్రభుత్వం తీసుకుంటుంది. దాన్ని పేదవారికి పంచి ఇస్తుందని కరణంగిరి పోయిన మాధవరావు మాలపల్లి జనులకు చెప్పి అర్జీ పెట్టించి డబ్బు కట్టిస్తాడు. ప్రభుత్వం కూడా 200 మందికి భూమి పంచిపెట్టింది. దున్నటానికి సిద్ధమైన హరిజనులను అడ్డగిస్తారు ఆ ఊరిపెద్దలు, పోలీసులు కూడా పెద్ద మనుషులకు అనుకూలంగా ఉంటారు. ఆ ఘర్షణలో చిన్నోడు, హనుమంతులు చనిపోతారు. భూమి గొడవల్లో చనిపోయినవారిపై సరిహద్దు సంఘర్షణ ఫలితంగా చనిపోయినట్లు చిత్రించడంవల్ల, అమాయకులైన హరిజనులపై ఎలాంటి నేరారోపణలు జరుగుతున్నాయో ఈ నవల్లో చిత్రించారు దేవపుత్ర. ప్రభుత్వం కల్పించిన సౌకర్యాలు హరిజనులకు అందడం లేదని, వారి ఆనందం అద్దంలో చందమామ లాంటిదని, అరచేతిలో వైకుంఠం లాంటిదని చెప్పారు రచయిత. పల్లె ప్రజల అమాయకత్వాన్ని ఈనాటికి కొందరు భూస్వాములు వినియోగించుకుంటున్నారని తెలియజేస్తుంది నవల. ఆ ఊళ్ళో ఉన్న కామందులు ముగ్గురే. ఆ ముగ్గురు మూడు వందల మంది హరిజనులను మోసం చేసిన వైనాన్ని చిత్రిస్తుంది ఈ నవల.

## అంటరాని వసంతం :

జి. కల్యాణరావు రాసిన ఈ నవల్లో నారిగాడి పోరాటం (ఇది మొదటి పోరాటంగా చెప్పాలి). సాంస్కృతిక పోరాటం - (ముత్తయ్య), నీటి కోసం పోరాటం (బతుకు కోసం పోరాటం) మల్లయ్య - విప్లవ పోరాటం (రూబెను) వంటి ప్రధానాంశాలను చర్చించడం

కన్పిస్తుంది. అసలు దళితుల్లో మాలమాదిగలు ఎలా వచ్చారు? అనే అంశాన్ని ఓ పిట్టకథగా చెప్పడం ప్రారంభం అవుతుంది. ప్రారంభంలోనే రచయిత రూబెను మొదట పరిచయం చేస్తాడు - ఆమె రచయిత్రి. రూబెను మరణించడం వల్ల ఒంటరిగా కూర్చొని రూబెను జ్ఞాపకాల మధ్య నిశ్శబ్దంగా కాలం గడపడం, బారెడు వసంతాన్ని బతుకంతా వల్లించి వెళ్ళిన లేని రూబెను జ్ఞాపకం మలుపు మలుపుకి కళ్ళకు కట్టినట్టుగా చూపిస్తారు రచయిత. రూబెను తాతకు వాళ్ళ తాత చెప్పిన కథ. అంటరానితనం కారణంగా ఒక వర్గం, ఒక జాతి జనం స్త్రీ పురుషులు ఎలా తపించారో వారి ఆత్మలు ఎలా విలవిల్లాడి పోతాయో ఇందులో చూపిస్తారు. మానవుడిలో సహజంగా తిరగబడే తత్త్వం ఉంది. అంటరానివారిగా ముద్ర వేయబడిన ఒక జాతి అస్తిత్వాన్ని నిరూపించుకోవడం, తమ ఉనికిని చాటుకోవడానికి జరిపిన పోరాటాలు ఈ నవల్లో కన్పిస్తాయి. రూట్స్ (Roots) నవల్లా తన పూర్వీకుల వృత్తాంతాలను రూబెను ఏ ఒక్కటి మరువకుండ సేకరించి, భద్రపరచి ఉంచడం ఈ నవల విశేషం. రూబెను జ్ఞాపక తరంగాలుగా ఇతివృత్తం ముందు వెనుకలకు ఊగుతూ సాగడం ఈ నవల్లో కన్పించే గొప్ప శిల్పం.

## ఉరుముల నాగన్న (నారిగాడి పోరాటం) :

పోరాట క్రమానికి వస్తే మొదటి పోరాటం ఆత్మరక్షణ కోసం నారిగాడు జరిపిన పోరాటం. నీళ్ళు పొంగినప్పుడు ఇతర కులాలకంటే ఎత్తైన ప్రదేశంలో మాలవాళ్ళు ఉండకూడదు. దిబ్బమీద కెళ్ళడం. నారిగాడి నేతృత్వంలో వీరంతా వెన్నెల దిబ్బ మీదకెళతారు. పెద్ద కరణం నారిగాణ్ణి బలితీసుకుంటాడు. నారిగాడి స్నేహితుడు ముత్తయ్య పెద్ద కరణాన్ని బలి తీసుకుంటాడు.

## సాంస్కృతిక పోరాటం లేదా ఆత్మగౌరవ పోరాటం :

మేనత్త భూదేవి దగ్గర కథలు, పాటలు, నాట్యం నేర్చుకుంటాడు ఎల్లన్న, ఎర్రన్న, ఎర్రెంకడి కొడుకు. నాగన్న ఎల్లన్నకు ప్రత్యేకించి భాగవతుల నాట్యాలు నేర్పడం, వాటిని ఎల్లన్న తమ ఊళ్ళో ప్రదర్శించడం ఘనత వహించిన పెద్ద మాల, పెద్ద మాదిగ అని ఆటకు ముందు వారి పెద్దలను పై విధంగా సంబోధించడం, ఆ ఊరి రెడ్డి, కరణాలకు సహించదు. ఆ ఊరి పెద్దలు అలా పిలవకూడదంటే ఎల్లన్న నాట్యం మానేస్తాడు. వీధి భాగవతుల నాటకాలు మానేస్తాడు. కాని అలా పిలవడం మానడు. ఈ సన్నివేశంలో మనకు ఎల్లన్న ఆత్మగౌరవ పోరాటం కన్పిస్తుంది. ఎల్లన్న సుభద్రని పెండ్లి చేసుకుంటాడు. ఎల్లన్న పాడిన పాటలు - 'సూబద్రయినవే' కూలి చేసుకొనేవాళ్ళకు సుపరిచితాలే.

## బ్రతుకుకోసం పోరాటం - అంటే నీటికోసం పోరాటం :

అంటరానితనం వల్ల నమిష నిమిషం ఆవేదనకు గురై, అవసరాల కోసం ప్రతినిత్యం అలమటించే బతుకులు ఈ నవల్లో సాక్షాత్కరిస్తాయి. నీటికోసం బావి దగ్గర బ్రతిమాలటం - మాల మాదిగలకి మంచినీళ్ళబావి లేకపోవడం, ఊరి మొత్తానికి ఉన్నది ఒకటే మంచినీళ్ళబావి. దాన్నే బొడ్డు బాయి అంటారు. బుంగెడు నీళ్ళ కోసం పెద్ద కొట్లాటే జరుగుతుంది. ఆ బ్రతుకులకి గుక్కెడు నీళ్ళకోసం బ్రతిమిలాడటాలు, భంగపడటాలు. తిట్టిపొయ్యటాలు, తిరస్కారాలు మామూలే. మల్లయ్యకి నీళ్ళదొంగనే పేరు ఉంది. పిట్టోడు పోలడి ముసలవ్వా మల్లయ్య కలిసి కట్ట తెగినట్లు కన్పించకుండా, కట్టను తెంపారు. నీటి కోసం వారు చేసిన పోరాటంలో పిట్టోడి చెయ్యి నెత్తురు కారింది. పోలడి వీపు నెత్తురు కారింది. ఇది ఆ కరణం రెడ్డి చేసిన దౌష్ట్యానికి ఉదాహరణగా చెప్పాలి. ఈ పరిస్థితుల్లో సుభద్ర ప్రక్కనే ఉన్న పార తీసుకొంది. పార ఎత్తి మడవ మీద బలంగా పారని దింపింది. నీళ్ళ కాలువ గండి కొట్టింది - మట్టి లాగి పక్కకు తోసింది. గండిపడ్డ నీళ్ళు. పార ఎత్తి అలాగే నిల్చుంది. అలా నిల్చున్న సుభద్ర మనుషులకేసి చూస్తున్న కాళిలా కన్పించింది. అచ్చిరెడ్డి, బుక్కిరెడ్డి వచ్చారు. బుక్కిరెడ్డికి సుభద్ర సుభద్రలా కన్పించలేదు. ఆ పిల్లని అమ్మ ఆవరించిందనిపించింది. ఆ పల్లె నమ్మకంలో సుభద్ర చేసిన సాహసం కేవలం నీటికోసం చేసిన పోరాటమనే చెప్పాలి.

## కూలి కోసం పోరాటం :

ఆ పల్లెలో కరవు రావడం వల్ల అందరు చనిపోతారు. కూలి కోసం మైళ్ళు మైళ్ళు నడవటం దయనీయం. బకింగ్‌హాం కాల్వ తవ్వకాలలో చాలా మంది కూలీలు పని చేస్తున్నారు. శివయ్య పనికోసం అక్కడికి చేరుకున్నారు. ఎన్నెల దిన్న మాలోడని తెలిసి, అతడిపై దాడి చేస్తుంటే పారిపోయాడు, శివయ్య కూలి కోసం చేసిన పోరాట దృశ్యాన్ని ఈ నవల్లో చిత్రించడం కన్పిస్తుంది.

## విప్లవం :

విప్లవవాదిగా రూబెను కన్పిస్తాడు. ఈ వాదంలో కూలీలు కలిసిపోతారు. కులం లేదు, కులభేదాలు లేవు. ఆ కాలంలో అన్ని కులాలవారు క్రైస్తవ మతాన్ని స్వీకరించడం వల్ల కులభేదాలు తగ్గాయని చెప్పవచ్చు.

జాతీయోద్యమానికి ముందున్న పోరాటం మనకు అంటరాని వసంతంలో కన్పిస్తుండే జాతీయోద్యమకాలానికి సంబంధించిన ఇతివృత్తం మాలపల్లిలో కన్పిస్తుంది. అంటరాని వసంతంలో అత్తా కోడళ్ళమధ్య, భార్యా భర్తలమధ్య మమతానుబంధాలు కనిపిస్తాయి. వాటిని చక్కగా చిత్రించారు రచయిత. నవల్లో కొంత కాల్పనికత, శైలిలో మాధుర్యంతో పాటు, దళిత స్పృహని కూడా గమనించవచ్చు.

చుక్కల ముల్లు కర్ర, వెన్నెల దిబ్బ వంటి పదాలు కవిత్వాన్ని గుర్తు చేస్తాయి. ఈ

నవల్లో రచనా శైలిలో ధారాశుద్ధి, వేగం, వాడి ఉన్నాయి. ఉదా॥ భూదేవి, సుభద్రల అనుబంధం, శశిరేఖని ఆదుకున్న మార్టిన్ శారమ్మ అనుబంధాలను ఎంతో గొప్పగా చూపిస్తారు.

దళితేతర రచయితలు, దళిత రచయితలు తెలుగు నవలల్లో దళితవాదస్పృహని ఇలా పై నవలల్లో స్పష్టంగా చిత్రించారు.

- ఢిల్లీ తెలుగువాణి, జనవరి - 2001



# ఆధునిక తెలుగు కవిత్వంలో ప్రపంచీకరణ ప్రభావం !

**తెలుగు** సాహిత్యంలో ఏ కొత్త ధోరణి వచ్చినా, అది కవిత్వంలోనే ముందుగా ప్రతిఫలిస్తుందని, ఇప్పటి వరకూ వచ్చిన వాదాలు, ఉద్యమాలన్నీ తేటతెల్లం చేస్తున్నాయి. కాల్పనికవాద ప్రభావం వల్ల భావ కవిత్వం వచ్చినా, తర్వాత వచ్చిన వాదాలు, ఉద్యమాల్లో, చెప్పుకోదగిన, వైవిధ్యమున్న వాటిల్లో అధివాస్తవిక, దిగంబర, మార్మిక, ప్రతీక, స్త్రీ, దళిత, మైనారిటీ వాదాల్ని చూసినా ఇది అర్థమవుతూనే ఉంది. కవిత్వ చరిత్రలే, మన తెలుగు సాహిత్య చరిత్రలుగా రూపొందడానికి ఈ చారిత్రక నేపథ్యాన్ని కూడా ఆలోచించవలసి ఉంటుందనిపిస్తుంది. సాహిత్య చరిత్ర నిర్మాణం, యుగ విభజనలూ ప్రధానంగా కవుల రచనలపైనే దృష్టిని కేంద్రీకరించడానికి కూడా ఇది దోహదం చేసిందని భావించే వీలుంది. ఆదిలో కవిత్వంతో ప్రారంభమైనప్పటికీ, ఆ ప్రభావం తర్వాత మిగిలిన ప్రక్రియల్లో మరింత ఫలవంతమవుతున్నప్పటికీ, వాటిని పట్టించుకున్నప్పుడే సాహిత్య చరిత్రల రచనలపైనా, యుగవిభజనపైనా వివాదాలు తలెత్తుతుంటాయి. ఇంతకీ, ఇది అంతా దేనికోసమంటే, మన తెలుగు సాహిత్యంలో, ఈ ఆధునిక జీవన విధానంలో ప్రభావం చూపిస్తున్న అన్ని రంగాలను కవులు, కవయిత్రులు కవిత్వమై ప్రవహిస్తున్నారనీ, ఏ ఇతర భాషకూ తీసిపోకుండా సమకాలీన సమాజాన్ని ఆవాహన చేసుకొని, గమ్యనిర్దేశం చేస్తున్నారనీ చెప్పటానికే! ఇంతవరకూ పేర్కొన్నట్లు వర్తమాన సాహితీ వాదాల్నీ, ప్రభావాల్నీ సొంతం చేసుకొన్నట్లే ప్రపంచీకరణ (Globalization) ప్రపంచవ్యాప్తంగా చూపిస్తున్న ప్రభావాన్ని కూడా మన తెలుగు కవులు కవిత్వీకరిస్తున్నారు.

1990ల తర్వాత ప్రపంచంలో ముఖ్యంగా శాస్త్ర, సాంకేతిక రంగాల్లోనూ, రాజకీయ, ఆర్థిక రంగాల్లోనూ విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి. ఒకవైపు అవసరాల్ని తీర్చడంలో అనాయాస పరిస్థితులు సృష్టించినా, మరోవైపు ప్రతిక్షణం భయం గుప్పెట్లో ప్రాణాల్ని ఇచ్చుకోవాల్సినంతగా శాస్త్ర సాంకేతికరంగాలు అభివృద్ధి చెందాయి. ప్రపంచంలో ఏ మూల ఏమి జరిగినా నిమిషాలు, సెకన్ల మీద ప్రపంచమంతటికీ తెలిసిపోయే కమ్యూనికేషన్ వ్యవస్థని శాస్త్ర, సాంకేతిక రంగాలు అందించాయి. ఇంకా అంతరిక్ష ప్రయోగాలపై మరింత పట్టు సాధించడానికి శాస్త్రవేత్తలు తలమునకలవుతూనే ఉన్నారు. జీనోమ్ ప్రాజెక్టు కనిపెట్టిన 'జన్యుకోడ్' వల్ల ప్రపంచంలో ఎటువంటి

పరిస్థితులు ఉత్పన్నమవుతాయో. ఇప్పటికే కొన్ని ఫలితాలు నిర్ధారణ చేస్తున్నా, పూర్తిగా విజయవంత మైతే, దీని ప్రభావాన్ని మరింత ఆలోచించవలసి వస్తుంది. ఇప్పటికే అన్ని పరీక్షలు ఆడపిల్లల్ని గర్భంలోనే చంపేయడానికి అవకాశాన్ని కల్పిస్తున్నాయి. స్కానింగ్ వంటి వాటిని నిరోధించవలసిన పరిస్థితులు కన్పిస్తున్నాయి. ఒక్కో రంగాన్ని సూక్ష్మంగా ఆలోచించుకుంటూపోతే ఇలాంటివి ఎన్నో విజయాలు, ఆందోళనలు మనకళ్ళముందు ప్రత్యక్షమవుతుంటాయి.

రాజకీయంగా కొన్ని దేశాల్లో నేటికీ రాజరికాలు కొనసాగుతుంటే, మరికొన్ని సమాజాల్లో 'సంఘవ్యవస్థ' రూపొందని ఉన్నాయి. వాటిని అనాగరిక సమీక్షలని కొంతమంది పిలుస్తున్నా, నాగరిక సమాజాలని పిలువబడుతున్న దేశాల్లో కూడా ఒకవైపు ప్రజాస్వామ్యం, మరోవైపు నియంతృత్వం, వీటన్నింటిపైనా సామ్రాజ్యవాదం అలుము కొని, కొన్ని దేశాల్లో, తమకున్న శాస్త్ర, సాంకేతిక, ఆర్థిక రంగాలవల్ల తమ గుప్పెట్లో పెట్టుకోవడం, నిరసనలు ఎదుర్కోవడం జరుగుతూనే ఉన్నాయి. ఏదిఏమైనా, శాస్త్ర, సాంకేతిక రంగాల్లో వచ్చిన మార్పులు కొన్ని దేశాలకే పరిమితం కాకుండా ప్రపంచ వ్యాప్తంగా విస్తరింపబడి 'ప్రపంచం ఒక కుగ్రామం' అనే భావనకు దారితీసింది. ఇల్లు కదలకుండా అరచేతిలో స్వర్గాన్ని చూసినట్లు చూడగలుగుతున్నారు. 1980లకు ముందు కొన్ని అభివృద్ధి చెందిన దేశాలకే పరిమితమైన శాస్త్ర, సాంకేతిక వ్యవస్థ 1990ల తర్వాత అభివృద్ధి చెందుతున్న దేశాలకూ అందుబాటులోకొచ్చేసింది. 2000ల తర్వాత ఇది మరింత గ్రామస్థాయిలోకి చొచ్చుకొని పోవడానికి ప్రయత్నిస్తోంది. ఈ ఇంటర్నెట్, సెల్‌ఫోన్, వెబ్‌ఫోన్ సిస్టమ్, వీడియో, టెలికాన్ఫరెన్స్ వంటివన్నీ కొంతమందిని ఆధునికుల్ని చేశాయి. ఆధునికత అనేది కేవలం కాలాన్ని సూచించేదే కాదనీ, అదొక తత్వమని ఒక విమర్శకుడు పేర్కొన్నాడు. ఒక్కో దేశంలో ఒక్కో సమాజంలో ఇది నిత్యప్రవాహినిగా మారుతుంది. నిన్నటిదానికంటే, ఇవేళ ఏదైనా కొత్తదివస్తే, ఇలా వచ్చింది ఆధునికమైంద వుతుంది. అందుకనే, ఆధునికతకు సరైన నిర్వచనాన్ని ఇవ్వడం కష్టం. అదొక తత్త్వ మనడమే సమంజసం. ఇలాంటి ఆధునికతను అవగాహన చేసుకోగలిగి తమ రచనల్లో ప్రతిఫలించే సాహిత్యం ఆధునిక సాహిత్యమవుతుంది. 'ఆధునికత'లో సామాజిక అభ్యుదయం గూడా తోడైనప్పుడే అది ఆధునిక జీవనాన్ని సరైన మార్గాన్నివ్వ గలుగుతుంది. ఆధునిక సమాజంలో జీవిస్తున్నంతమాత్రంచేత, ఆధునికంగా వచ్చేవాటిని అన్నింటినీ ఆహ్వానించాలనీ లేదు. వ్యతిరేకించాలనీ లేదు. కానీ, ఆధునికంగా వచ్చినదాన్నితత్వాన్ని పరీక్ష చేయవలసి ఉంటుంది. మానవ కల్యాణానికి ఉపయోగ పడేదే ఉండాలి. మూఢ విశ్వాసాల్ని పెంచేవిగా కాకుండా, వాస్తవికంగా, శాస్త్రీయంగా, ఆచరణాత్మకంగా, అత్యధికుల ప్రయోజనాన్ని ఆశిస్తూనే, మిగిలిన వర్గాలవారికి హానితలపెట్టనిదై ఉంటే మంచిదవుతుంది. అలాంటిదై నా ఆధునిక సమాజంలో

అసహ్యించుకోవచ్చు. కానప్పుడు నిరసన, వ్యతిరేకత తప్పదు. ఆధునిక సాహిత్యంలో భిన్న సంఘర్షణనుంచి, కొత్త భావనలు బయలుదేరడానికి ఇదొక కారణమవుతూనే ఉంది. అలాంటి సంఘర్షణల ఫలితమే, సమాజం చూపిస్తున్న ప్రత్యక్ష ప్రభావం, జీవన విధానం తెలుగు కవులు, కవయిత్రుల చేత ప్రపంచీకరణ గురించి కవిత్వం రాయిస్తున్నాయి.

ప్రపంచవ్యాప్తంగా వస్తున్న మార్పుల్లో ప్రధానంగా శాస్త్ర, సాంకేతిక, ఆర్థిక రంగాల్లో వచ్చిన మార్పులే అన్ని దేశాల్నీ, సమాజాల్ని గమ్యనిర్దేశం చేస్తుండడం వల్ల, కొన్ని తప్పని సరి పరిస్థితులవల్ల భారతీయ సమాజంలోను వీటి ప్రవేశాన్ని నిరోధించలేని పరిస్థితి ఏర్పడింది. ఆర్థికంగా, రాజకీయంగా, సాంస్కృతికంగా దీని ప్రభావం గట్టిగానే పనిచేస్తూ, చివరికి 'అస్తిత్వాన్నే' ప్రశ్నించుకోవాల్సిన స్థాయికి చేరుతుందని కవులు, కవయిత్రులు కలాన్ని ఆయుధాలుగా సంధించడానికి సిద్ధపడ్డారు. వేయి సంఘర్షణలకు గురవు తున్నారు. ఈ సంఘర్షణ 90ల తర్వాతనే స్పష్టంగా కనిపిస్తున్నా, 80ల తర్వాతనే అంతర్లీనంగా కనిపిస్తోంది. కానీ 80ల తర్వాత స్త్రీ, దళితవాద భావజాలమే ప్రధానం కావటంవల్ల సాహితీవేత్తలు స్త్రీ, దళిత కవిత్వయుగాలుగానే తలంచటం పరిపాటి అయిపోయింది. 80ల తర్వాత కమ్యూనిస్టు దేశాల్లో వచ్చిన తిరుగుబాటు మన తెలుగులో విప్లవ, అభ్యుదయ కవుల్లో ప్రపంచీకరణకు వ్యతిరేకంగా అంతర్లీనంగా కవిత్వం వస్తూనే ఉంది. కానీ, 90ల తర్వాతనే మిగిలిన కవుల్లో దాని ఛాయలు స్పష్టం కావడం మొదలయ్యాయి. 90ల తర్వాత దీని ప్రభావం స్పష్టం కావడానికున్న చారిత్రక భూమికను అవగాహన చేసుకోవడానికి ప్రయత్నిస్తే, ఆర్థిక సరళీకృత విధానాలు భారతీయులపై ప్రత్యక్ష ప్రభావాన్ని చూపడమేనని తెలుస్తుంది. అందువల్ల, 1990ల తర్వాతనే తెలుగులో ప్రపంచీకరణ ప్రభావం స్పష్టంగా ఉన్నా, 90ల తర్వాత దేశంలో బాబ్రీమసీదు కూల్చివేత, మన రాష్ట్రంలో దళితులపై జరిగిన మారణకాండ, దళిత మహాసభ ఉద్యమ విస్తృతి వంటివాటివల్ల దళిత కవిత్వం ప్రధానమైంది. 90 తృతీయార్థంలో దళితుల్లో వచ్చిన అంతఃసంఘర్షణ ఫలితంగా, మీడియా ప్రదర్శించిన విధానాలవల్ల దళిత సాహిత్యం ప్రధాన స్రవంతిగా కాకుండా, పోస్టుమాడ్రనిజమ్, గ్లోబలీకరణలపై దృష్టిని కేంద్రీకరించడం అనివార్యమైంది.

డంకెల్ ప్రతిపాదనలు, గాట్ నిబంధనలు రైతులకు శాపంగా మారడం, విత్తనాలు పునరుత్పత్తి కోల్పోయి, పూర్తిగా విదేశీయులు సరఫరా చేసే విత్తనాలపైనే ఆధారపడవలసి రావడం వల్ల, అధికోత్పత్తులు సాధించడంకంటే, టెర్మినేట్ సీడ్స్‌పట్ల వ్యతిరేకత వ్యక్తమయ్యింది. పేటెంట్ హక్కులు కోల్పోవడంకంటే, తమదేశంలో తాము పండించే పంటలకు, విదేశీ కంపెనీలు ఉత్పత్తిచేసి పంపిణీ చేసే విత్తనాలకై ఎదురు చూడవలసి

రావడంవల్ల ధరలు ఆకాశానికెగిరిపోవడం. తమ పంటలకు సరైన గిట్టుబాటు ధరరాక పోవడం సహజంగానే జరుగుతుంది. ఇవన్నీ రైతుల్ని మరింత బానిసల్ని చేస్తాయని భావించారు. ఇక్కడనుండే బహుళజాతి కంపెనీల, గుత్తాధిపత్య దేశాలపెత్తనంపై మేధోపరమైన వ్యతిరేకత ఎదురైయ్యింది. ఇది చాలావరకూ మన తెలుగు కవిత్వంలో ప్రతిబింబమైంది. తొలిసారిగా కవిత్వంతో ప్రారంభమైనా తర్వాత, కథల్లో ఇది మరింత శక్తివంతమైంది.

ప్రపంచ వాణిజ్య సంస్థ, ఐక్యరాజ్యసమితి వంటివన్నీ అమెరికా ఆదేశానికి ఇంచు మించు తలవగ్గవలసి రావటం, దాని సామ్రాజ్య విధానాన్ని ఇతర దేశాలపై రుద్దడానికి ప్రయత్నించడంగా భావించటం వల్ల, దేశ్యాప్తంగా ప్రారంభమైన ఆర్థిక సరళీకృత విధానాలు, ప్రపంచబ్యాంకు రుణాలు ఇచ్చినా, అవి పెట్టే షరతులూ అన్నీ సామ్రాజ్యవాద దేశ ఆధిక్యతను, పెత్తనాన్నీ పెంచేవిగా మారతాయని ప్రజల్లో మొదలైన నిరసన ప్రదర్శనలు, తెలుగు కవులు కవిత్వంలో వర్ణించగలిగారు. ప్రపంచబ్యాంకు ఇచ్చే రుణాల్లో 'అభివృద్ధి' అనేది ఒక బూచి మాత్రమేనని, అది దేశ ఆర్థిక దివాళాకోరుతనానికి దారితీస్తుందనీ, దేశంలో అవినీతి పెరిగిపోతోందనీ, రాజకీయప్రాబల్యం వల్ల పాలనపట్ల పారదర్శకత ఉన్నట్లు ఉన్నా, అవి కేవలం ఏ పార్టీ అధికారంలో ఉంటే, ఆ పార్టీలో కొంతమందికి 'అవకాశం' కల్పించి, అధికార దుర్వినియోగానికి ఉపయోగపడి, దేశంలో నైతిక విలువలు పతనమవ్వడంవంటివి ఊహకే భయంకరమనిపించేట్లు కవిత్వీక రించటం గమనించగలుగుతాం. ప్రపంచబ్యాంకు ఆదేశాలమేరకు దేశంలో ఉన్న వివిధ ప్రభుత్వ రంగసంస్థలన్నీ ప్రయివేటు వ్యక్తుల చేతుల్లో పెట్టేస్తూండడం వల్ల పేద, మధ్యతరగతివాళ్ళు పేదవారుగానూ, ధనికులు మరింత ధనికులుగానూ మారిపోవడం జరుగుతుందని ప్రతిధ్వనిస్తున్నారు.

సాంకేతికంగా వచ్చిన విప్లవం వల్ల ఇంటర్నెట్ వ్యవస్థ సాంస్కృతికంగా భారతీయ సమాజాన్ని ఆలోచనలో పడేస్తుంది. దేశీయ పండుగలు, ఉత్సవాలకంటే విదేశీయుల పండుగలు, ఉత్సవాలపై 'విపరీతాభిమానం' ప్రకటించటం వల్ల యువతీ యువకుల్లో డిస్కోతెక్, పాప్‌మ్యూజిక్, న్యాచురల్ నైట్స్ వంటివి బాగా పెరిగిపోయాయి. సినిమా, దూరదర్శన్‌లలో ప్రదర్శించే వాటిపై నియంత్రణలున్నా, ఇంటర్నెట్‌లో ఈ నియంత్రణ కష్టమైపోయి, దీని పెడధోరణులవల్ల సాంస్కృతికంగా, మానసికంగా నైతిక పతనానికి దిగజారిపోయే పరిస్థితులు నెలకొన్నాయి. వాటిపైనా, తెలుగు కవులు, కవయిత్రుల కవిత్వం రాస్తున్నారు. స్త్రీ, దళిత, మైనారిటీ కవితల్లో ద్విపార్శ్వాలు కన్పిస్తున్నాయి. స్వదేశంలో తమపై జరుగుతున్న దాడులు, అవమానాలను నిరసిస్తూనే కాపాడుకోవటం మొదటి పార్శ్వమైతే, ఈ దేశ పౌరులుగా తమ అస్తిత్వాన్ని నిలబెట్టుకుంటూ, ప్రపంచీ కరణను వ్యతిరేకించే దేశభక్తి తొణికిసలాడటం రెండవ పార్శ్వంగా కన్పిస్తోంది.

ఈ పరిణామాల దృష్ట్యా వెలువడిన కవితా సంపుటి గ్లోబలైజేషన్. ఇందులో 48 కవితలున్నాయి. వివిధ కవులు, కవయిత్రులచే రాయబడింది. ప్రజాస్వామ్యపు తీరు తెన్నులను వివరిస్తూ నిఖిలేశ్వర్ రాసిన కవిత "శీర్షిక లేని కవిత"ను పరిశీలిద్దాం.

"ప్రజాస్వామ్యం ముసుగేసుకున్న
కొత్తయంత
గుఱ్ఱమెక్కి జనం మీదికి
దౌడు తీస్తున్న వర్తమానం
పాతకొయ్య గుఱ్రాలకు

ఎప్పుడో కాలం చెల్లిపోయింది
ఇంతకాలం ముఖంలేని మూకగా వున్న
సమూహమే రొమ్ము విరుచుకొని
జెండాల ఎరుపులో
కొత్త రక్తం నింపింది

ఎస్వీ 'క్షీరసాగరమథనం' కవిత - కళాకారులను, కవులను, రచయితలను ప్రశ్నిస్తూ సమాజంలో కన్పిస్తున్న విపరీత ధోరణులను గురించి వివరిస్తుంది.

"ప్రజలకు మిగిలేది హాలాహలం
ప్రపంచ బ్యాంకుకు అమృతమని తిడతారెందుకు
కర్మణ్యావాధికారస్తే.....శ్లోకంనూరిపోయరా!
ఫలితాల కోసం వాదిస్తారెందుకు!
మేం హైటెక్ వేగంతో ఇరవయ్యొకటవ శతాబ్దిలోకి
పరుగుడుతుంటే
ఇంకా భూమి - భుక్తి - విద్య - విద్యుత్తులంటూ
ఇక్కడే ఆగిపోతారేమిటి?
అయినా
మీరు కవులో రచయితలో కళాకారులో
మా కెందుకుగానీ,
ముందు మీరు మా ప్రజలు కండి' -

ప్రపంచీకరణవల్ల, ప్రతీది తమ ముంగిట నిలబడిందనే విషయాన్ని గుర్తుచేస్తూ, తాకట్టుపెట్టడానికి ఇంకేముందని ప్రశ్నిస్తూ ఆవేదనను వ్యక్తం చేస్తున్న అఫ్సర్ "గ్లోబలిటీస్" కవితలో....

"అన్నీ ముంగిటకొచ్చాయి
వాకిలి ముందే
ప్రపంచం సంతలా
అన్నీ రూపాయిలైపోయాయి.
ఒొక్క నేను తప్ప
అన్నీ అమ్మకానికి సిద్ధం

తనఖా పెట్టడానికి
ఇంకేముందని అడుగుతుంది
తడిమాటలతో తడిసి
గొంతునొక్కే
అందమైన కత్తులు
నాట్యమాటుతున్నాయి.
చుట్టూరా......"

ప్రపంచం నవనాగరికతలో మునిగిపోయిందని, కొత్త శతాబ్దంలో అడుగుపెట్టిన సమకాలీన సమాజంలో అస్తవ్యస్తంగా ఉన్న ప్రభుత్వపు పనితీరు, మనుషుల్లో మమతలు, మమకారాలు తెగిన గాలిపటాల్లా ఏ మూలకో విసిరివేయబడ్డాయని, సగటు మనిషి మనుగడే కష్టంగా మారిన తీరును వర్ణిస్తున్న కవితే అద్దంకి శ్రీనివాస్ "కొత్త శతాబ్దం వెంటాడుతోంది"

"కళ్ళు ఎంత విప్పార్చినా లాభం లేదు
పెరుగుతున్న ధరల బరువులను గుండెలు మోయలేకపోతూ
మ్రింగుడుపడని సమస్యాత్మక గరళపు ముద్దల్ని
తినలేక శ్మశానాలవైపు దృష్టిసారిస్తూ
మమతల మాటల్ని
జన్మస్థానాల్నించి బయటకు రానీయక
అభద్రత పక్కలోని బల్లేన్ని చూసి జడుసుకుంటూ
మొద్దుబారుతున్న మెదళ్ళతో జాలిపోతో
పైకి లాగేవారేలేక
నేలవాదుల్ని స్థిరమైన వాదాల్ని పెకళించుకొని
విమానం రెక్కలపై
మునివేళ్ళతో భారంగా నిట్టూరుస్తూ....

ఆత్మీయతల్ని
కనుకొలకుల్నించి తెలీకుండానే జార్చేస్తూ
ప్రపంచం యావత్తు కాలానికివ్రేళ్ళాడుతుంటే
అధికారం చేస్తున్న ఆగడాలను,
అణచివేతలను జీవితాలను బలిగొంటున్న స్వాత్నిక్‌లను
స్పష్టంగా చిత్రిపరుస్తున్న గీత
కవిత గీతరాసిన 'ధ్వంసరచన'

అధికారానికి మానసపుత్రిక
అణచివేత పథకం
ఎకానామిక్స్ జపించే పాలకులకు
న్యూటన్ మూడో సూత్రం తెలీదు"

రాబందుల రాజ్యంలో
రైతు రైతుగానే మిగలాలంటే
డంకెల్ సూత్రాలు, ఉల్ఫెన్ సోన్‌ల ఉవాచలు బట్టీ
వేయాలి
లేకపోతే
వెన్నెముకలన్నీ దేశానికి దిష్టిబొమ్మలై మిగులుతాయి."

సూర్యవంశి రాసిన 'డంకెల్ పాఠం' కవితలో-

"బండి
గుట్ట ఎక్కుతోంది
బండిలో
గడ్డిమోపుల బరువు
ఆకలి ఎడ్లు
ఎలాగో....ఎలాగో
బరువుబండిలాగు తున్నాయి
కొరడా దెబ్బలు తింటున్నాయి.
ఆ దున్న పోతుది
డంకెల్ బ్రీఫ్ ఫిలాసఫి
గ్లోబల్ ఫిలాసఫి
ఆ దున్నపోతు ఫిలాసఫీ
పార్లమెంటరీ పాఠం

తోటను తాకట్టు పెట్టేవాళ్ళు
పిచ్చుక గూళ్లను
ఎలా కాపాడుకుంటారు?

పై కవిత్వ పంక్తుల్లో ప్రపంచ బ్యాంకు నీడన పెరిగే సాంస్కృతిక సామ్రాజ్యవాదంతో పాటు పెరిగే భూస్వామ్య విలువలతో కూడిన దేశీ సాంస్కృతిక సామ్రాజ్యవాదాన్ని కూడా ప్రశ్నిస్తున్నాయి.

'తోట' మనుషులు నిర్మించుకున్న కల, జీవితం తోటను పోగొట్టుకున్న రైతు అంటే మనం నిర్మించుకున్న నేల మన చేతుల్లోంచి, మనది కాకుండా పోతుందనే ఆవేదన వ్యక్తం అవుతుంది. ప్రపంచీకరణను వ్యతిరేకించే క్రమంలో కవులు తమ కవితల ద్వారా నిరసనను తెలియజేయడం వల్ల వస్తువు నవ్యతను పొంది తెలుగు కవిత్వంలో చోటు చేసుకుంది.

- విశాలాంధ్ర - నవంబరు - 2001



# మా మాష్టారు జీవియస్

**ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం** సాహితీ సమాలోచనంపై సాహితీ సదస్సును నిర్వహించడం ఎంతో సముచితం అని నేను భావిస్తున్నాను. సదస్సు నిర్వాహకులు నాకిచ్చిన అంశం 'మా మాష్టారు'. నిజానికి నేను గర్వంగా చెప్పుకొనే గురువు మా మాష్టారే. వారే ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారు.

సాహితీ కేదారంలో వివిధ ప్రక్రియలనే సస్యాల్ని పండించిన సాహితీ కృషీవలుడు మా మాష్టారే. ఇటు విద్యార్థులలో జ్ఞాన దీపాలను వెలిగించి, అటు సాహితీ ప్రియుల మనోనేత్రాలను కదలించిన కాలజ్ఞాని మా మాష్టారు. ఎంతో మంది గురువుల వద్ద చదువుకున్నాను. అందరు నేను చెప్పుకునే గురువులే. కాని సద్గురువుగా నేను పరిగణించే వారు మా మాష్టారు. వారే ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారు.

మాష్టారితో గల పరిచయాన్ని కొద్దిగా ఇక్కడ చెప్పవలసిన అవసరం ఉంది. నేను ఎమ్.ఎ. చదివే రోజుల్లో మాష్టారి పేరు పేపర్లో చూడడం, వినడం తప్ప ఆయన్ని నేను చూడలేదు. కారణం - నేను కాకినాడలో ఉండడం వల్ల వారిని చూడలేకపోయాను. హైదరాబాద్‌లో ఒక ప్రైవేటు కాలేజీ వారు తెలుగు లెక్చరర్ పోస్టుకి పేపరు ప్రకటన ఇవ్వడం అది చూసిన నేను ఆ పోస్టుకి అప్లయ్ చేశాను. అనుకోకుండా ఆ జాబ్‌కి నేను సెలెక్ట్ కావడం, నేను హైదరాబాద్ రావడం జరిగింది. ఆ విధంగా అడుగు పెట్టిన నేను కేంద్రీయ విశ్వవిద్యాలయం వారు నిర్వహించే తెలుగు ఎమ్.ఫిల్ కోర్సు ఎంట్రన్స్ రాశాను. అందులో సెలెక్ట్ కావడం వల్ల మొదటిసారిగా కేంద్రీయ విశ్వవిద్యాలయ ప్రాంగణంలో అడుగుపెట్టడం, అక్కడ మాష్టార్ని చూడడం జరిగింది. నేను మాష్టార్ని చూశాను కాని వారికి నేను ఎవరో తెలియదు. ఇంటర్వ్యూలో మాష్టారు నా సబ్జెక్టు గురించి అడిగి, చివరగా మీ నాన్నగారి పేరేమిటి అని ప్రశ్నించారు. మా నాన్నగారి పేరు చెప్పానో లేదో - దగ్గరే ఉన్న డా॥ ఆనందరామంగారితో అమ్మాయి ఎవరో తెలుసా అని అన్నారు. ఆ మాటల్లోనే వారికి మా నాన్నగారి పట్ల ఉన్న ఆత్మీయత నాకు అర్థం అయ్యింది. ఆనాటి నుండి ఈనాటి వరకు మాష్టారు నన్ను శిష్యురాలిగానే పలుకరిస్తూ వారి ఆత్మీయతా వర్షాన్ని కురిపిస్తూనే ఉన్నారు. అది మా మాష్టారి విశిష్ట వ్యక్తిత్వానికి నిదర్శనం.

పరిశుద్ధమైన వాక్కు విశాల హృదయం ఉన్న మా మాష్టారంటే నాకెంతో అభిమానం, గౌరవం. వారి మాట, మనస్సు నవనీతాలే. 'నిండు మనంబు నవ్య నవనీత

సమానం' అన్న నన్నయ నుడికారం మాష్టారి హృదయ సంస్కారానికి శ్రీకారం. మితభాషి, మౌనిలా కన్పించినా ఆయన మౌనంగా ఉండరు. వారి వాక్కులో ఋుక్కులు ధ్వనిస్తాయి. ఎన్నో కావాల్యలలోని విశేషాలు మనకు గోచరిస్తాయి. నిజానికి విజ్ఞాన భాండాగారమే మా మాష్టారు.

ఆయన వ్యక్తిత్వాన్ని గుర్తించడానికి ఆయనలో కొన్ని అంశాలున్నాయి. అది విద్యార్థుల పట్ల ప్రేమ, నిరాడంబరత, నూతనత్వాన్ని ఆహ్వానించడం వంటి లక్షణాలు వారిలో చాలా ఉన్నాయి.

1. *విద్యార్థులతో సన్నిహితత్వం :*

నేడు ఉపాధ్యాయులు విద్యార్థులను ఇంటర్వ్యూలలో ఎన్నో ప్రశ్నలతో తికమక పెట్టేస్తారు. అందుకే విద్యార్థులు ఇంటర్వ్యూలంటే ఒకరకమైన భయంతో ఉంటారు. మాష్టారు ఇంటర్వ్యూ చేసే విధానం ఇందుకు భిన్నంగా ఉంటుంది. విద్యార్థిని ఏవిధంగా అడిగితే సమాధానం చెప్పగలడో ఆ విధంగా ప్రశ్నలు వేయడం వారిలోని భయాన్ని పోగొట్టడమే కాకుండా విద్యార్థి ఎంతో సంతోషంగా అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పి వెళ్ళేటట్లు చేస్తారు. అది వారి ప్రతిభకు నిదర్శనం. అంతేకాదు - నన్నయ పాఠంతో విద్యార్థులకు ఇంకా కావలసినంత విజ్ఞానాన్ని అందిస్తారు. అందుకే మాష్టారంటే ప్రాణం పెట్టే విద్యార్థులలో మాష్టారు గురువులా కాకుండా మిత్రునిలా, తండ్రిలా కూడా కన్పిస్తారు.

2. *నూత్న సిద్ధాంత ప్రతిపాదన :*

సుమారు 20కి పైగా గ్రంథాలు రాసినా, ఒక నూత్న సిద్ధాంతాన్ని సాహితీ లోకానికి అందించినా కించిత్ గర్వంలేని నిగర్వి మా మాష్టారు.

విశ్వనాథ నవ్య సంప్రదాయం వారు ప్రతిపాదించిన నూత్నాంశం. ఇది జి.వి.ఎస్. గారి మహా జీనియస్, మనలను ఆశ్చర్యచకితులను చేస్తోంది అని అనటంలో సందేహం లేదు.

3. *విమర్శకాగ్రేసరులు :*

'A critic must have a seeing eye'

విమర్శకునికి వివేచించు విచక్షణాచక్షువులుండాలి అని అంటాడు కార్లైల్. నేడు మంచి చెడులను సమీక్షించలేని కుహనా విమర్శకులున్న సమాజంలో కార్లైల్ అభిభాషణాన్ని పాటించేవారు మా మాష్టారు. ఆంధ్రభూమిలో జి.వి.ఎస్. కాలమ్ పేరుతో

ఎన్నో వ్యాసాలు, సమీక్షలు రాసారు. అవి అందరిని అలరించేవిధంగా ఉన్నాయి. ఆ విమర్శావ్యాసాలు సద్విమర్శకుల నుతికి అర్హమైనవిగా కీర్తింపబడ్డాయి. అదేవిధంగా ఆంధ్రప్రభలో రాసిన తెలుగు సాహిత్యంలో చర్చనీయాంశాలను మనం గమనిస్తే వారి నూత్న దృష్టి, శీర్షికలకు వారు పెట్టిన తీరు నవ్యతను సంతరించుకున్నాయనిపిస్తుంది.

4. *ఆహ్వానించడం :*

సాహితీ క్షేత్రంలో అడుగు పెట్టిన ఏ కొత్తవారినైనా పలుకరించడం, వారి కవితలను, కథలను, వ్యాసాలను పరామర్శించడం, తన కలంతో వారిని మనసారా ఆశీర్వదించడం వారి గుణం. తాను కవిని కాదంటూనే విశ్వధర్మాలను సాక్షాత్కరం చేసిన కవితపస్వి మా గురువు.

ఏ విషయాన్నైనా ఎన్నో కోణాలతో ఆలోచించి, ఇటు విద్యార్థులకు అటు సాహితీ లోకానికి అవసరమైన విజ్ఞానాన్ని అందిస్తూ, రసజ్ఞులైన సాహితీ వేత్తలు వారి మాటలను ఆమోదించేటట్లు చేయడం, వారిలో ప్రవహిస్తున్న విశిష్ట వ్యక్తిత్వం. అది వారి మేధస్సుకు నిదర్శనం.

5. *నిరాడంబరత :*

సముద్రానికై ఆటుపోటులు తప్పవంటారు. అన్నీ సద్గుణాలతో విలసిల్లే నిండైన మా మాష్టారికి అప్పుడప్పుడు ఎలాంటి అల్పమైన అవాంతరాలు కల్గినా ఋషి వలె ఉన్న ఆయనను చూసి అవి ప్రక్కకు తొలగిపోతాయి. అది వారి సహన దృష్టికి వారి మనోబలానికి ఆభరణాలు.

ఆయన మాటల్లో అమృత ధారలు జాలువారుతాయి. వారి నిండైన విగ్రహం నాలాంటి విద్యార్థులకు ఎన్నో విధాలుగా ధైర్యాన్ని, ఆత్మస్థైర్యాన్ని కలిగిస్తుంది. అధ్యాపకుడిగా, కవిగా, మహావక్తగా, బహుభాషా పండితుడుగా, నాటకకర్తగా, విమర్శకునిగా, మహామనిషిగా పేరు పొందిన మా మాష్టారికి నా చిన్న వ్యాసం చంద్రునికో నూలు పోగులా భావిస్తూవారికి సత్యసాయి ఆయురారోగ్య ఐశ్వర్యాలను ప్రసాదించాలని మనసారా కోరుకుంటూ.....

"సకల శాస్త్ర సర్వజ్ఞుడవు
సాహితీమూర్తివి
వసుధపై నీలాంటి సద్గురువు లేరు సుమా!
భేషాజాలు, ఈర్ష్యాద్వేషాలులేని

అకల్మష కీర్తిశాలివి
ధీరశాలివి
అరువది వత్సరాలు నిండుతున్న
అందరి మన్ననలను పొందుతున్న
అరుదైన మూర్తివి
మా మనస్సులను దోచుకున్న
మనసైన మానవతా మూర్తికి
అర్పించెదను నా
హృదయపూర్వక
కుసుమ కైవార నీరాజనాలు!"

*- జీవియస్ సాహితీ సమాలోచనం-1996.*



# 'వ్యాసకర్త'గా ఆచార్య ఎస్వీరామారావు

ఏదైనా ఒక విషయాన్ని సైద్ధాంతికంగా వివరించటానికి వ్యాసప్రక్రియ ఎంతగానో ఉపకరిస్తుంది. వ్యాసం అనగానే ఒక విషయాన్నిగాని కొన్ని ముఖ్యాంశాల్నిగాని ప్రతిపాదించి, వానికి ఉపపత్తులను చూపిస్తూ ఒక విషయాన్ని సమన్వయించి తాను చెప్పదల్చుదేమిటో చెప్తూనే ఆ విషయం గురించి సంబంధిత విషయ నిపుణుల అభిప్రాయాలను విశ్లేషించటం వ్యాసాల్లో సర్వసాధారణంగా జరుగుతుంది.

పత్రికలు వచ్చిన తర్వాత వ్యాసంలో ఏ విషయాన్ని అయినా చెప్పగలిగే వీలు కలగటమే కాకుండా, వ్యాసాలు చదివేవారి సంఖ్య కూడా గణనీయంగా పెరిగింది.

వ్యాసాల్లో చాలా రకాలు ఉన్నప్పటికీ ప్రస్తుత వ్యాసంలో ఆచార్య ఎస్వీరామారావు గారి వ్యాసవైవిధ్యాన్ని పరిశీలించటం ఈ వ్యాస ఉద్దేశం. ఎస్వీ రామారావుగారి వ్యాసాల్లో ఎటువంటి విషయాలు ఉన్నాయి. ఆ విషయాల్ని ఎలా చెప్పారు, అవి ఎటువంటి పాఠకులను ఆకట్టుకున్నాయి. ఆ వ్యాసాల్లో చెప్పే విధానం ఎలా ఉందో మొదలైన విషయాలను అన్నింటినీ పరామర్శించటం వల్ల వ్యాస రచనలో వీరి పాండిత్యం మరింత బహిర్గతమయ్యే అవకాశం ఉంది.

'వ్యాసం' అనగానే ఉపోద్ఘాతం, విషయప్రతిపాదన, విషయ వివరణ, నిపుణుల అభిప్రాయాలు, వ్యాసకర్త గమనించిన అంశాల్ని సమీక్షించటం, తులనాత్మక పరిశీలన చేయటం ద్వారానే ఆ వ్యాసాన్ని ఆలోచింపజేసే విధంగా లేదా తాను చెప్పదల్చుకున్న విషయాన్ని సమర్థిస్తూ ముగించటం కన్పిస్తుంది.

వస్తుగుణ స్వభావాల్నిబట్టి వైజ్ఞానిక విషయక వినోదభరిత వ్యాసాలుగా అనేక విధాలుగా వ్యాసాల్ని విభజిస్తుంటారు. వ్యవహారంలో గ్రంథ పరిణామం కలిగినవాటిని కూడా వ్యాసాలు అని పిలవటం మనం వింటూనే ఉన్నాం. విశ్వవిద్యాలయాల్లో పరిశోధకులు సమర్పించే సిద్ధాంత గ్రంథాన్ని సిద్ధాంత వ్యాసాలనీ, పరిశోధన వ్యాసాలనీ పిలవటం కూడా ఈ సందర్భంగా పేర్కొనదగినదే. ఆచార్య ఎస్వీరామారావు గారు "తెలుగు సాహిత్య విమర్శ - అవతరణ వికాసములు" పేరుతో పిహెచ్.డి. డిగ్రీ కోసం సిద్ధాంత వ్యాసాన్ని ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించారు. తర్వాత దీన్ని "తెలుగులో సాహిత్య విమర్శ" అని గ్రంథరూపంలో ప్రచురించారు. వారు రాసిన వ్యాసాల్ని పరిశీలించటం ద్వారా ఆ గ్రంథ స్వరూప స్వభావాలను కూడా తెలుసుకోవచ్చు. 1984లో ప్రచురించిన 'అన్వీక్షణం', 1992లో ప్రచురించిన 'సమవీక్షణం', 1998లో

ప్రచురించిన 'అభివీక్షణం' గ్రంథాలు అన్నీ వ్యాస సంపుటులు. ముందుగా ఒక్కొక్క విషయానికి సంబంధించిన వ్యాసాల్ని రాసి, వాటిని సెమినార్లల్లోనో, పత్రికల్లోనో ఆకాశవాణి ప్రసంగాల్లోనో ప్రకటించినవే ఆ వ్యాస సంపుటాలు. 1990లో The Evolution of Telugu literacy criticism పేరుతో రాసిన ఆంగ్ల గ్రంథం కూడా సుదీర్ఘమైన వ్యాసంగానే చెప్పుకోవచ్చు. 1998లో ప్రచురించిన 'నన్నయ దర్శనం' కూడా మన ఆదికవి నన్నయను అంచనా వేసే వ్యాసమే. ఇది ఒక గ్రంథంగా వెలువడింది. వీరి వ్యాస సంపుటాలలో గల విషయా వైవిధ్యాన్ని బట్టి కొన్ని రకాలుగా విభజించే వీలుంది. వీటిని కింది విధంగా విశ్లేషణాత్మక వర్గీకరణ చేయవచ్చు.

## పరిశోధన వ్యాసాలు :

ఏదైనా ఒక విషయాన్ని సాధ్యమైనంత సమగ్రంగా వివరించడానికి ఆ విషయంపై గతంలో వచ్చిన వ్యాసాల్ని, గ్రంథాల్ని వివరాలిన్నంటినీ అంటే సామగ్రీ సేకరణ చేయటం గాని ఒక నూతన విషయాన్ని ప్రతిపాదించటం ద్వారా దాన్ని నిరూపించటం లేదా కొత్త విషయాన్ని వెలికితీయటం గాని సమన్వయాన్ని అందించటంగాని జరిగే వ్యాసాలు "పరిశోధన వ్యాసాలు"గా చెప్పుకోవచ్చు. దీనిలో భాష అలంకారికతకంటే విషయవిశ్లేషణకే ప్రాధాన్యతనివ్వటం, తద్వారా మేధోవికసనం కల్పించటం వీటి ముఖ్య ఉద్దేశ్యం. మొదట్లో కందుకూరి వీరేశలింగం పంతులుగారు తెలుగు కవుల జీవితాల్ని, రచనల్ని సేకరించి ఒకచోటుకు చేర్చటమే ఒక పరిశోధనగా పరిగణించారు. అది ఆ రంగంలో జరిగిన తొలి ప్రయత్నం కాబట్టి సామగ్రీ సేకరణను ఒక క్రమపద్ధతిలో చెప్పటం కూడా పరిశోధనగానే భావించటానికి వీలుంది. వీటిని ప్రకటించే వచన విధానం వ్యాస ప్రక్రియగా రూపొందింది. ఆ తర్వాత కాలంలో సాహిత్యంలో కన్పిస్తున్న వివిధ దృక్పథాలు, సిద్ధాంతాలు, ఉద్యమాలను నిరూపిస్తూ వ్యాసాలు వెలువడ్డాయి. ఇవన్నీ పరిశోధక వ్యాసాలుగానే చెప్పవచ్చు.

ఆచార్య ఎస్వీరామారావు గారు పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం రాశారు. ఇది పెద్ద పరిశోధన వ్యాసం అవుతుంది. ఈ పరిశోధన వ్యాసంలో విమర్శ అంటే ఏమిటో, విమర్శకు ముందున్న వ్యాఖ్యానాలు, కావ్యావతారికలు, కావ్య పీఠికలు మొదలైనవి విమర్శస్థానాన్ని భర్తీ చేసిన విధానం. ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య రంగాల్లో జరిగిన విమర్శ పద్ధతులను వివరించటం, ఆ విమర్శ ఆధునికత సమీపంలో పరిణామం చెంది భిన్న విధాలుగా రూపుదిద్దుకున్న విషయ వివరణనూ, ఇంకా విమర్శ రంగంలో జరగవలసిన కృషినీ చక్కని శైలిలో సులభంగా అర్థమయ్యేవిధంగా రాశారు. సిద్ధాంత వ్యాసం అనగానే కొంతమందికే అర్థమవుతుందనేది సరైన అభిప్రాయం కాదనీ, ఆ విషయాన్ని చదవాలనీ తెలుసుకోవా లనుకునే అందరికీ అర్థమవుతుందని నిరూపించే విధంగా సరళమైన భాషలో రాశారా. వ్యాసంలో, ఎటువంటి విషయాన్ని చెప్పినా వ్యాసకర్త నైపుణ్యాన్ని బట్టి Readability ఆధారపడుతుందని నిరూపించగలిగారు.

వీరి పరిశోధన వ్యాసాల్లో చేరే వ్యాసాలు చాలా ఉన్నాయి. విశ్వవిద్యాలయాల్లోను వివిధ సంస్థలు నిర్వహించిన సాహిత్య సమావేశాల్లోనూ సమర్పించే వ్యాసాలు కూడా పరిశోధన వ్యాసాలే అవుతాయి. వీటిలో సిద్ధాంతచర్చ విశ్లేషణలకు ప్రాధాన్యత ఉండటం ప్రధానమైన గుణం. విద్యార్థులను దృష్టిలో పెట్టుకొని ఈ వ్యాసాల్ని రూపొందించటం జరుగుతుంది. వీటిలో ప్రారంభించటం ఆకట్టుకోవటం, ముగింపు అద్భుతంగా ఉండటం కంటే Content analysis ని present చేయటం ప్రధానం. వ్యక్తికి ఉండవలసిన లక్షణాల్లో స్పష్టత ఉంటే దీన్ని ఎలా వివరించాలి వంటివి పాటిస్తూ తన ప్రతిపాదనను లేదా తన సిద్ధాంతాన్ని సమర్థించుకునే వివేచన అనేది వ్యాసకర్తకి ఉంటే దాన్ని సమర్ధ వంతంగా వ్యక్తం చేయవచ్చు. ఇటువంటి పరిశోధన వ్యాసాల్లో చర్చలకు దారితీసే అంశాలు ఉన్నా వాటికి సమాధానాలను కూడా శాస్త్రీయంగా వివరించటం ముఖ్యం. అంటే ఈ వ్యాసం మేధోసంబంధమైనవని తెలుస్తుంది. మేధ బాగా వికసించగలిగే టట్లయితే దానివల్ల హృదయాహ్లాదం కూడా కలుగవచ్చు.

'సమవీక్షణం' వ్యాస సంపుటిలో 'తెలంగాణాలో సాహిత్య పరిశోధకులు' అనే వ్యాసాన్ని ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించారు. తెలంగాణా ప్రాంతంలో గల సాహిత్యపరిశోధకులను, వారి కృషిని ప్రాంతాలవారీగా వివరించి చెప్పటం ఈ వ్యాసంలో content analysis. ఈ వ్యాసంలో ప్రొ॥ ఎస్వీరామారావుగారు, తెలంగాణా ప్రాంత పరిశోధకుల కృషిని వివరిస్తూ కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారు విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి ద్వారా ఎంతో కృషి చేశారనీ, భాషా రంగంలో వాడుకలో ఉన్న ఎడిటర్ అంటే సంపాదకుడు, యూనివర్సిటీ అంటే విశ్వవిద్యాలయం అనే పారిభాషిక పదాలను కల్పించారని వివరించారు.

సుప్రసిద్ధ పరిశోధకులు మానవల్లి రామకృష్ణ కవిగారు చేసిన కృషినీ శేషాద్రి రమణ కవులుగా వాసికెక్కిన దూపాటి శేషాచార్యులు, దూపాటి వెంకటరమణాచార్యులు గార్ని గురించి ఎన్నో కొత్తవిషయాల్ని అందించారు. శేషాద్రి రమణ కవుల కృషి ఫలితంగానే ఈనాడు లభిస్తున్న వసుచరిత్ర వ్యాఖ్య ఆంధ్ర పదనిధానము రెడ్డి కుల నిర్ణయ చంద్రిక మేదినీహారావళి నిఘంటువు వివరణములను చక్కగా వివరించారు. ఇంకా ఇదే వ్యాసంలో తెలంగాణా ప్రాంతంలో గల పరిశోధకుల్లో ఆదిరాజు వీరభద్రరావు, సురవరం ప్రతాపరెడ్డి, మాడపాటి హనుమంతరావులు ఆంధ్రభాషా సాహిత్యాలకు కృషి చేయటమే కాకుండా ఆంధ్రోద్యమంలో వీరి కృషిని కూడా వివరించారు. హైదరాబాదు రేడియోలో తొలి ప్రసంగం కావించిన ఆదిరాజు విజ్ఞానకోశంలో 50 వ్యాసాలు పైగా రచించారు. గోలకొండ కవుల సంచికను విడుదల చేయటంలో సురవరం ప్రతాపరెడ్డి గారు కృషి ఎనలేనిది. "హిందువుల పండుగలు" గురించి ప్రప్రథమంగా సురవరం వారే వివరించారని ఆచార్య ఎస్వీ రామారావు పేర్కొన్నారు. ఇంకా ఖండవల్లి లక్ష్మీరంజనం, పల్లా దుర్గయ్య, బిరుదురాజు రామరాజు, సి. నారాయణరెడ్డి మొదలైనవారి

పరిశోధనలను ఈ వ్యాసం వివరిస్తుంది. తెలంగాణా ప్రాంతంవారు తెలుగుభాషా చరిత్ర సాహిత్యాలకు ఇంత కృషి చేశారా అనేది ఎస్వీరామారావు గారి వ్యాసాలవల్ల స్పష్ట మవుతుంది.

'అభివీక్షణం' సమవీక్షణం వ్యాస సంపుటిల్లోనూ నన్నయ దర్శనంలోను ఈ పరిశోధన వ్యాసాలు చాలా ఉన్నాయి.

## పత్రికల్లో రాసిన వ్యాసాలు :

సులభమైన శైలిలో అందరికీ అరటిపండు ఒలిచిపెట్టినట్టు సందర్భానుసారంగా ఛలోక్తులను, సామెతలను నానుడులను జాతీయాలను ప్రయోగిస్తూ ఆసక్తిదాయకంగా చదివించేగుణం పత్రికల్లో కన్పిస్తుంది. పత్రికల్లో వస్తున్న వ్యాసాల్లో అనేక రకాలు ఉన్నప్పటికీ "సహితస్య భావఃసాహిత్యమ్ హితేన సహితమ్ సాహిత్యమ్. అనే లక్షణాలను ప్రధానంగా కలిగించే వ్యాసాలు సాహిత్య వ్యాసాలు. అచార్య ఎస్వీ రామారావు చాల పత్రికల్లో చాలా సాహిత్య వ్యాసాల్ని ప్రకటించారు. ఒక కవిని గాని, ఒక గ్రంథాన్ని గాని వివరించేటప్పుడు దానికి సంబంధించిన వివరాలన్నింటినీ రాసినప్పుడే పాఠకులకు సాధ్యమైనంత సమగ్రమైన సమాచారం అందించినట్లు అవుతుంది. ఈ లక్షణాలన్ని ఎస్వీరామారావుగారు పత్రికల్లో రాసిన సాహిత్య వ్యాసాలన్నింటిలోనూ కన్పిస్తాయి. పత్రికల్లో రాసిన వ్యాసాల్లో ఎస్వీరామారావుగారి వ్యాసాల్ని, మూడు విధాలుగా విభజించ వచ్చు. అవి ప్రాచీన, ఆధునిక సాహిత్యాలకు సంబంధించిన వ్యాసాలు, చలన చిత్రాలకు సంబంధించిన వినోదాత్మక విషయాలను వివరించే వ్యాసాలు, సాహిత్యానికి సంబంధించిన వ్యాసాల్లో మరలా, వ్యక్తులకు అంటే కవుల, రచయితల, పరిశోధకుల, విమర్శకుల వ్యక్తిత్వాలను తెలిపే వ్యాసాలు.

## ప్రాచీన సాహిత్యం గురించిన పత్రికా వ్యాసాలు :

'అన్వీక్షణం' వ్యాస సంపుటిలో వీటిని సంపుటీకరించారు. 1968లో 'విశ్వరచన' పత్రికలో తెలుగు కావ్యావతారిక, ఆంధ్రప్రదేశ్ పత్రికలో (1965) ఎఱ్ఱన-పోతన, వివేచన (1981)లో ప్రచురించిన 'తెలుగు కావ్యపీఠికలు' మొదలైనవి ప్రాచీన భాషా సాహిత్యాల గురించి రాసిన పత్రికా వ్యాసాలు.

'ఎఱ్ఱన-పోతన' అనే వ్యాసం కవుల వ్యక్తిత్వంతోపాటు వారు రాసిన రచనలను కూడా నిశితంగా పరిశీలించి తులనాత్మక విమర్శను చేశారు. వారు సంస్కృత మూలాలనుంచే వస్తువుని గ్రహించినా వాటిని యథాతథంగా అనువదింపక స్వేచ్ఛా ప్రవృత్తిలో అనేక మార్పుల్ని చేసి తమ కావ్యాల్ని తీర్చి దిద్దారని పేర్కొన్నారు ఆచార్య ఎస్వీ రామారావుగారు.

పీఠికకకు తొలిరూపమైన కావ్యావతారికల గురించీ కావ్యపీఠికలగురించి కూడా పత్రికల్లో రాసి, పత్రికా వ్యాసాల్లో కూడా గొప్ప వ్యాసాలు ఉంటాయని నిరూపించారు. ఎంతటి క్లిష్టతరమైన విషయాన్ని అయినా చిన్నచిన్న వాక్యాల్లో సరళమైన శైలిలో రాయటం వల్ల సామాన్య పాఠకులు కూడా అర్థం చేసుకోగలరని నిరూపించే విధంగా చక్కగా రాశారు ఎస్వీరామారావుగారు.

తెలుగు కావ్య పీఠికలకు నన్నయ శ్రీకారం చుట్టారని చెప్తూ తర్వాత పూండ్ల రామకృష్ణయ్య గారు 'అముద్రిత గ్రంథచింతామణి' పత్రిక నెలకొల్పారని అందులో ప్రచురించబడిన కావ్యాలకు రాసిన పీఠికల్లో ఎన్నో విషయాలు ఉన్నాయనీ అవి సాహిత్య పరిశోధనకు అవసరమైనవని వివరించారు. 'కుమార సంభవ పీఠిక'ను రాసి నన్నెచోడుణ్ణి పరిచయం చేసినటువంటి రామకృష్ణ కవి కృషిని, ప్రాచీన గ్రంథాలకు పీఠికలను సమకూర్చిన జయంతి రామయ్యపంతులు, బసవపురాణం, పండితారాధ్య చరిత్రలకు పీఠికలు రాసిన కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, చిలుకూరి నారాయణరావు గార్లు రాసిన పీఠికలు పేర్కొనదగినవని వాటి విశిష్టతను వివరించారు.

'క్రీడాభిరామం'కి వేటూరి ప్రభాకరశాస్త్రి, 'భీమేశ్వర పురాణాని'కి చిలుకూరి పాపయ్యశాస్త్రి, పల్నాటి వీరచరిత్ర కు పింగళి లక్ష్మీకాంతం, కళాపూర్ణోదయానికి కట్టమంచి రామలింగారెడ్డిగార్లు రాసిన పీఠికలు మొదలైనవి వాటిలోని విశేషాల్ని సరళమైన భాషల్లో పత్రికలకు తగిన రీతిలో రాయటం జరిగిందని వివరించారు ఎస్వీరామారావు గారు.

## ఆధునిక సాహిత్యానికి సంబంధించిన పత్రికా వ్యాసాలు :

'అన్వీక్షణం' వ్యాస సంపుటిలోగల కొన్ని వ్యాసాలు ఆధునిక సాహిత్యానికి సంబంధించినవి కన్పిస్తున్నాయి. దీనిలో వచన కవితాకేతనం, అనే వ్యాసాన్ని ఆంధ్రజ్యోతి (1974)లోనూ 'కవితా పయోనిధి' అనే వ్యాసాన్ని ఆంధ్రభూమి (1977) లోను, వచన కవితా చక్రవర్తి పేరుతో కుందుర్తి గురించి విశాలాంధ్ర (1977)లోను బోయి భీమన్న గారు రాసిన 'దీపసభ కార్యం గురించి భీమన్న తీర్చిన మయసభ అనే వ్యాసాన్ని (1980)లోనూ నవలా విమర్శలు గురించి 'నందిని' (1981) ల్లోనూ - ఇలా ఆధునిక సాహిత్యానికి సంబంధించిన వివిధ ప్రక్రియలలో గల విషయాల్ని వివరిస్తూ రాశారు. వచన కవితకు ఆద్యుడుగా పేర్కొనదగిన కుందుర్తి రచనలను వివరిస్తూ-

'ఇది నా కవిత్వం గీత వినేవాడు నరుడు  
చదువూ సంధ్యలు రాని రోడ్డు మీద పామరుడు  
లేమితల్లి యెడిలో నిరంతర గాఢానిద్రాపరుడు''

అని సగటు మనిషిని నాయకుడుగా చేసి వర్ణిస్తూ వచన కవితా ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్ళిన కుందుర్తి సాహిత్యాన్ని చక్కగా వివరించారు. అలాగే సి.నారాయణ రెడ్డిగారి రచనలను కూడా వివరించారు ఆచార్య ఎస్వీరామారావు గారు.

## వ్యక్తిత్వం - సాహిత్య కృషిని వివరించే వ్యాసాలు :

వివిధ సెమినార్లలోను, పత్రికల్లోనూ, ఆకాశవాణిలోనూ ప్రకటించిన కొన్ని వ్యాసాల్లో కవుల, విమర్శకుల, పరిశోధకుల, చారిత్రకుల మూర్తిమత్వం ప్రతిబింబించి నట్లు, వారి వ్యక్తిత్వాన్ని సాహిత్యాన్ని అంచనా వేస్తూ వ్యాసాలు రాశారు.

'చిరస్మరణీయుడు గరిమెళ్ళ', విమర్శకుడుగా సినారె, కావలి రామస్వామి, కోదాడ వారి ఒరవడి, కవికొండల, పింగళి కాటూరి, బుచ్చిబాబు, గోపీచంద్, సరస్వతీ పుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులు, పత్రికా రచయితగా సురవరం, జ్యోతిర్మయుడుగా బూర్గుల, బిరుదురాజు రామరాజు గారి గురించి గురుపూజ ఆచార్య గోపాలకృష్ణారావు 'జల్ దిల్‌హి టూట్ గయా' వ్యాసంలో ఇరివెంటి కృష్ణమూర్తి గారి నుంచి ఇలా ఎన్నెన్నో వ్యాసాల్ని అందించారు. ఈ వ్యాసాల్లో కన్పించే ప్రత్యేకత ఏమిటంటే - వివిధ వ్యక్తుల్ని పరిచయం చేస్తూనే, వారు సాహితీ, సామాజిక, సంస్కృతీ సాహిత్యరంగాలకు అందించిన సేవను బట్టి రూపొందే మూర్తిమత్వాల్ని (Personality)ని అంచనా వేయటం జరిగింది. విమర్శపద్ధతుల్లో కవి జీవిత విమర్శలో కవి జీవితానికి సంబంధించిన విషయాలు ప్రచురించి తీర్చే విధంగా ఈ వ్యాసాలు రాయటం ప్రశంసనీయం.

## ఆకాశవాణి ప్రసంగ వ్యాసాలు :-

వ్యాసాలు చదివేవి, వినేవి అని రెండు రకాలుగా పరిశీలిస్తే, వినేవాటిని ఆకాశవాణి ప్రసంగాలు అంటారు. శ్రవణ సౌలభ్యం అనేది దీనిలో ప్రధానంగా ఉండాలి. అవసరమైతే వర్ణనల ద్వారా చెప్పగలగాలి. ఇవి తర్వాత గ్రంథస్థమైనా వాటిలో శ్రవణ గుణం ఉన్నా అవి పాఠకులకు చదువుకోవటానికి బాగుంటాయి లేదా చదివి మరొకరికి విన్పించేందుకు అనుకూలంగా ఉంటాయి. Narration అనేది శ్రవణంలో ప్రధానం. "సమవీక్షణం" వ్యాస సంపుటిలో ఆకాశవాణి ప్రసంగ వ్యాసాల్ని చూడవచ్చు. స్వాతంత్ర్యోద్యమంలో తెలుగు కవులు, ఆధునిక కవిత్వంలో ఆత్మాన్వేషణ మొదలైన వ్యాసాల్ని ఈ విభాగంలో పరిశీలించవచ్చు.

భారతీయుల దృష్టిలో ఆత్మకు నాశనం లేదనీ అటువంటి ఆత్మమధనం నుంచే కవిత్వం పుడుతుందనీ ప్రాచీనకాలంలో ఋషులు తపస్సుతో ఆత్మ స్వరూపాన్ని దర్శిస్తే కవులు కూడా ఆత్మసాక్షాత్కారం వల్ల దర్శనాన్ని సాధిస్తారనీ ఆత్మమధనం నుంచే కవిత్వం

పుడుతుందని 'ఆధునిక కవిత్వంలో ఆత్మాన్వేషణ' అనే ఆకాశవాణి ప్రసంగంలో విన్పించారు. ఆత్మాన్వేషణతో ప్రారంభమైన ప్రజా కవి వేమన కవిత్వాన్ని గురజాడ అప్పారావు, నండూరి సుబ్బారావు, దేవలపల్లి కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, బాలగంగాధర తిలక్, సి. నారాయణరెడ్డి, కవయిత్రి నాయిని కృష్ణకుమారి, కోవెల సుప్రసన్నాచార్య మొదలైన వారి రచనల్లో కన్పిస్తున్న ఆత్మాన్వేషణ ఆధునిక కవిత్వంలో కన్పించే తీరును తమదైన రీతిలో విన్పించారు. ఆచార్య ఎస్వీరామారావు గారు. అదే విధంగా స్వాతంత్ర్యోద్యమంలో తెలుగు కవుల గురించి రాస్తూ "స్వాతంత్ర్యం కోసం ఉద్యమాన్ని ప్రజల ముందుకు తీసుకెళ్ళిన గరిమెళ్ళ, త్రిపురనేని, బసవరాజు, విశ్వనాథ, తుమ్మల, జాషువా, ఐతం ఇందిరల రచనల్లో కన్పిస్తున్న జాతీయతా భావాల్ని దేశభక్తిని మాతృదేశదుస్థితిని గత వైభవాన్ని వివరిస్తూ స్వాతంత్ర్యోద్యమంలో రచయిత / రచయిత్రుల పాత్ర ఎంతో ఉందని వివరించారు ఎస్వీరామారావుగారు.

కథా కథనం కూడా కొన్ని వ్యాసాల్లో ముఖ్యంగా ఆకాశవాణిలో కన్పించటం వల్ల వినే పాఠకుడుకి మరింత ఆసక్తి పెరుగుతుంది. ఇది వారి వ్యాసాల్లో కన్పిస్తున్న ప్రత్యేక గుణం.

ఈ విధంగా వీరి వ్యాసాల్ని, వ్యాస సంపుటులను పరిశీలించినపుడు, వ్యాసం రాయటంలో వారు పాటించిన పద్ధతులు, విషయాన్ని సులభంగా, సరళంగా, స్పష్టంగా బలమైన వివరణలతో వ్యాసాలు వివరించగలిగారని అర్థమవుతుంది. వీరి మేధోశక్తికి ఈ వ్యాసాలు నిదర్శనాలు. ఏదైనా విషయాన్ని డొంక తిరుగుడు లేకుండా స్పష్టంగా చెప్పటంతోపాటు ఆలంకారిక రచన కంటే విషయ వివరణ ప్రధానంగా ఉండేందుకు పలుకుబడులను, నానుడులను ప్రయోగించుకోవాలి. ఎస్వీ రామారావుగారు తమ వ్యాసాల్లో అన్నింటినీ సమపాళ్ళలో అందించి విషయాన్ని వివరించటమే. ప్రధానంగా భావించి వ్యాసరచనను కొనసాగించారని అర్థమవుతుంది. వీరు రాసిన 'చలన చిత్ర సమీక్షలు' వినోదాన్ని కూడా అందించే విధంగా ఆసక్తిదాయకంగా ఉంటాయి. Referenceలు అనేవి పాఠకుడికి ఆటంకం కల్పించుండా అవసరానికి ఉపయోగపడా లనేది వ్యాస రచనల్లో కన్పించే ప్రధాన గుణం. వీరి వైవిధ్యభరిత వ్యాసాల్లో పైలక్షణాలన్ని కన్పిస్తాయి. ఎస్వీరామారావు గారి వ్యాసాలను చదివితే "వ్యాసకర్త"గా వారి పాండిత్యం ఎంతటిదో అర్థమవుతుంది. ఉత్తమ అధ్యాపకుడిగా, పరిశోధకుడిగా, విమర్శకుడిగా మంచితనాన్ని పుణికిపుచ్చుకున్న మానవతావాదిగా ఆయన్ని పేర్కొనవచ్చు.

- షష్టిపూర్తి సందర్భంగా సమాలోచన సమావేశంలో
జూన్ - 11, 2000 సమర్పించి వ్యాసం



# జానపద కథల్లో స్త్రీ

కథ చెప్తాను అంటే వినని వారుండరు. జానపద కథ మనస్సుని రంజింపజేసే ప్రక్రియ. ప్రాచీన మానవుడు తన అనుభవాలను నలుగురితో పంచుకోవడంతోపాటు ఆ అనుభవాలకు మరింత మెరుగుదిద్ది ఉన్నవి. లేనివి కల్పిస్తూ కథను చెప్పడం ద్వారా సమాజంలో కథావ్యాప్తితోపాటు కట్టుకథలు కూడా వ్యాపించేలా చేశాడు. పగలంతా కష్టపడి కూలి నాలి చేసుకొనే జానపదులు తమ శ్రమను మర్చిపోవడానికి, రాత్రి వేళల్లో ఆరుబయట కూర్చొని కథల్ని వినేవారు. మంచిమాటకారి అయిన కథకుడు తాను చెప్పే కథ నలుగురిని ఆకట్టుకొనేవిధంగా ఉండటంవల్ల ఆ కథకుని చుట్టూ చేరి జానపదులు ఉత్సాహంగా కథలు విని మరీ ఆనందించేవారు.

"కథ కంచికి మనం ఇంటికి" "కథకు కాళ్ళు లేవు" అనే నానుడులు ప్రచారంలో ఉన్నాయి. దీనిని బట్టి చూస్తే కథల ప్రాచుర్యం మనకు అర్థం అవుతుంది.

ప్రపంచంలోని ఏ మారుమూల ప్రాంతానికి వెళ్ళినా జానపద కథలను చెప్పేవాళ్ళు, కథలు వినేవాళ్ళు అధిక సంఖ్యలోనే ఉంటారు. భారతదేశంలో కథ అంటే ఆసక్తి చూపని వారుండరు. అందుకే జానపద కథలకు భారతదేశం పుట్టిల్లుగా చెప్పబడింది. వేదకాలం నాటికే జానపద కథా బీజాలున్నట్లు మనకు ఆధారాలు కన్పిస్తాయి. రామాయణ, మహాభారత, భాగవత కథల్లో జనుల వాడుకలో చెప్పబడే జానపద కథలు కొన్ని సందర్భానుసారంగా చేర్చబడినవే. విష్ణుశర్మ పంచతంత్ర కథల్లోను జానపద కథలు కన్పిస్తాయి. గుణాఢ్యుని బృహత్కథ జానపద కథా సంగ్రహంగా చెప్పవచ్చు. బుద్ధుని జాతక కథల్లో పశుపక్ష్యాదులకు సంబంధించిన కథలున్నాయి. కథ అంటే కల్పిత గాథ అని కావ్యాదర్శసాహిత్యదర్పణాదుల్లో స్పష్టంగా చెప్పబడింది.

'మనుస్మృతి'లో కథా శబ్దానికి సంభాషణమనే ప్రయోగం కన్పిస్తోంది.

కథ అంటే వృత్తాంతం అని, కొన్ని సత్యాంశాలతో కూడుకున్నదని స్పష్టం అవుతుంది. అందువల్ల జానపద కథ వచన ప్రక్రియకు సంబంధించింది. కథకు జానపద కథకు భేదం లేదు. ఆ నోటినుండి ఈ నోటికి ఆ చెవి నుండి ఈ చెవికి తరతరాలుగా సంప్రదాయబద్ధంగా అందించబడిన కథా కథనమే జానపదకథ అని నిర్వచించవచ్చు. ఆంగ్లంలో 'ఫోక్ టేల్' కు సమానపదమే జానపదకథ.

స్టిక్ థాంసన్ సాంప్రదాయిక గద్యకథ జానపదకథ అని విశాలార్థంలో పేర్కొన్నాడు. ముఖ్యంగా జానపదకథలో జానపద పురాణం, ఐతిహ్యాలు చేరిన, జానపద కథని చెప్పేటప్పుడు పైరెండింటిని వేరుచేసి చెప్పవలసి ఉంటుంది. వస్తువుని దృష్టిలో పెట్టుకొని చూస్తే ఈ మూడింటిలో సమానత్వం కన్పిస్తోంది. కాని కాలం స్థలం వ్యక్తిపరంగా చూస్తే జానపద పురాణం ఐతిహ్యాలు జానపద కథకంటే భిన్నాంశాలుగా కన్పిస్తాయి. కథా సాహిత్యంలో మనకు రెండు విధాలైన సంప్రదాయాలు ఉన్నట్లు తెలుస్తోంది.

1. శిష్ట కథా సాహిత్య సంప్రదాయం
2. జానపద కథా సాహిత్య సంప్రదాయం

జానపద కథా ప్రక్రియలో కాలం, రచయితల గురించి చెప్పడం కష్టమైన విషయం.

లిఖిత సాహిత్యం ఏమూల వెలువడినా దాన్ని ఆదరించే ప్రజల ప్రమాణాలను దృష్టిలో వుంచుకొని ఆ ప్రమాణాలకు అనుగుణంగా వెలువడాల్సి వుంటుంది అదే మౌఖిక సాహిత్యానికి లిఖిత సాహిత్యానికంటే కొంత స్వేచ్ఛ అయిన పరిధి ఉంది. అందువల్ల మౌఖిక సాహిత్యం ఒక సమాజంలోని వారందరి ఆమోదాన్ని పొందగలదై ఉంది ఆ అనుభవాల్ని వారందరివిగా పంచుకోగలదై ఉంటుంది. ఈ మౌఖిక సాహిత్యానికి ఆశ్రయమైన వ్యక్తుల జీవన విధానాన్ని బట్టి ఈ స్వేచ్ఛ మరింత ఆధికంగా ఉండి వారి సాహిత్యాన్ని ప్రభావితం చేస్తుంది.

ఉదాహరణకు- శ్రామికులకు వ్యక్తిగతంగా ఉండే స్వేచ్ఛతో పాటు ఆర్థిక పరమైన స్వేచ్ఛ వారి జీవన విధానంలో కూడా స్వేచ్ఛను కలిగి ఉండటం వల్ల శ్రామికులు వ్యక్తి గతమైన ఆలోచనలో భావప్రకటనతో ఈ స్వేచ్ఛ వారి సృజనాత్మక సాహిత్యంలో కూడ కన్పిస్తుంది.

కథ సామాజిక వ్యవస్థను గతంనుండి వర్తమానం లోకి, వర్తమానం నుండి భవిష్యత్తులోకి ప్రసరింప చేసే సాధనం. జానపద కథలను పురాకథలు ఐతిహాసిక కథలు హాస్యకథలు సుదీర్ఘ కథలు సమస్యాత్మాక కథలు మోసగాంౖడ కథలు, ప్రాణి కథలు, అద్భుత కథలు, నీతికథలు సామాజిక కథలుగా వర్గీకరించవచ్చు.

సమాజంలో పుట్టి పెరిగిన కథ సమాజంలోని వివిధాంశాలను తీర్చి దిద్దుతుంది కూడ. అందువల్ల ఆ కథల్లో ఆ సమాజంలోని పరిసరాలు వ్యక్తుల మనస్తత్వం, వ్యక్తులు, మతం, నమ్మకాలు, సంప్రదాయాలు, వారి దినచర్యలోని సమస్త విషయాలు ఏదో ఒక విధంగా చోటు చేసుకోవడం కనిపిస్తుంది. అందుకే The folklore was a mirror of culture అన్నారు. ఆదర్శ జీవనానికి సమాజం మూలాధారం అయితే ఆ సమాజాభి

వృద్ధికి స్త్రీ పురుషుల పాత్ర ఎంతో ప్రాధాన్యతను కలిగి ఉంటుంది. సమాజంలో నివసించే ప్రతివ్యక్తికీ కుటుంబం ప్రాథమిక సంస్థ కాబట్టి ఆ కుటుంబాభివృద్ధికి స్త్రీ ప్రధాన పాత్ర వహిస్తుంది. సాంఘిక కార్యకలాపాలలో పురుషులు పాల్గొంటే కుటుంబ కార్యకలాపాలలో స్త్రీ ఎక్కువ ప్రమేయాన్ని కలిగి ఉంటుంది.

జానపద కథల్లో కాని ఆధునిక తెలుగకథల్లో కాని స్త్రీ పాత్ర లేని కథ లేదనే చెప్పాలి. సమాజంలో స్త్రీని ఒకవైపు గౌరవిస్తూనే ఆమెను అబలగా చిత్రించే కథలున్నాయి. స్త్రీ శక్తి స్వరూపిణి అంటూ కథలు చేప్పే రచయితలు స్త్రీని అమానుషంగా హింసిస్తూ అన్ని విధాలా స్త్రీని దిగజార్చే ప్రయత్నాలు చేసి, స్త్రీకి స్వాతంత్ర్యం అనర్హం అంటూ చిత్రించే కథలు మనం చదువుతూనే ఉన్నాం. స్త్రీలకి శీలం చాలా పవిత్రమైంది. అందం కంటే గుణం ప్రధానం అని నీతులు చెప్తూ వచ్చిన కథల వల్ల నడుస్తున్న చరిత్రలో స్త్రీల స్థితిని మరింత దిగజార్చే విధంగా ఉందనే చెప్పవచ్చు.

రచయితలలో కాలానుగుణంగా వస్తున్న ఆధునిక భావాల వల్ల స్త్రీ యొక్క గొప్పతనాన్ని చాటి చేప్పే కథలు కూడ మన సాహిత్యంలో లేకపోలేదు.

ఇకపోతే, జానపద కథల్లో స్త్రీ అనేక రూపాల్లో మనకు కన్పిస్తోంది. తల్లిగా, తనయగా, చెల్లిగా, కోడలిగా, అత్తగా, ఆడపడుచుగా, తోడికోడలుగా, సవతిగా, మేనత్తగా, మేనకోడలుగా, వదినగా, మరదలుగా, మహారాణిగా, దాసిగా, మంత్రకత్తెగా అనేక రూపాల్లో స్త్రీ సాక్షాత్కరిస్తుంది. అందువల్ల జానపదకథల్లో స్త్రీకి సంబంధించిన కథలను మూడు వర్గాలుగా విభజించుకోవచ్చు.

1. జానపద కథల్లో అత్త ఆధిక్యత.
2. జానపద కథల్లో కోడలు ఆధిక్యత.
3. జానపద కథల్లో స్త్రీ స్థితి.

## I. జానపద కథల్లో అత్త ఆధిక్యత :-

కుటుంబ జీవనంలో అత్తగారి పాత్ర ప్రధానంగా కనిపిస్తోంది. అత్తగారి ఆధిక్యతకు సంబంధించిన జానపద కథలు ఎన్నో ఉన్నాయి. కొన్ని కథల్లో కోడళ్ళను ఆరడి పెట్టే అత్త, మరికొన్ని కథల్లో సహృదయత్వం కలిగిన పాత్రలో కన్పిస్తోంది. ఏదిఏమైనా 'స్త్రీకి స్త్రీయే శత్రువు' అనే నానుడిని నిజంచేస్తూ జానపదకథల్లో అత్తపెత్తనం, అత్త ప్రాధాన్యతను తెలియజేసే కథలను పరిశీలిద్దాం.

*1. అత్తా కోడండ్ల కథ :-*

అనగా అనగా ఒక తల్లి కుమారుడు ఉన్నారు. తల్లి కుమారునికి పెండ్లి చేసి కోడలిని ఇంటికి తెచ్చుకున్నది. ఆ అత్త చాల దుర్మార్గురాలు. కోడలికి సరిగా అన్నం పెట్టక ఒక గ్లాసు అంబలిస్తోంది. కొడుకు, అత్తగారు పంచభక్ష్య పరమాన్నాలు తినేవారు. వారికి, కాపు దానముంది. ఆ తోటలో వంకాయల పంటపెట్టి వంకాయల వల్ల వచ్చిన లాభాన్ని వారు భుజిస్తుండేవారు. వారి ఇంటి ఎదురుగా ఈత చెట్టుంది. ఈత చెట్టు నుండి వచ్చే కల్లు తల్లీకొడుకులు తాగుతుండేవారు. ఒకరోజు కోడలు తన కష్టాన్ని ప్రక్కింటి ముసలవ్వకు చెప్పుకొంది. ఆమె సలహా తీసుకుంది. అత్త యధావిధిగా చెట్టెక్కి కుండ తీసేటప్పుడు క్రింద నిచ్చెన తీసేసింది. తర్వాత ఇంట్లోకి పోయి పళ్ళెంలో అన్నం పెట్టుకొని వంకాయ కూర వేసుకొని "అత్తా అన్నం బుక్క" అని మూడు మాట్లు అంది. ఆ మాట విన్న అత్త తొందరలో కిందకి చూసి నా ఇల్లు చెడగొట్టటానికే కోడలు వచ్చిందని దిగులుతో చేతిలోని పళ్ళెం విసిరింది. వెంటనే కిందపడి మరణిస్తుంది. తల్లి మరణానికి కొడుకు దుఃఖించినా కోడలు మాత్రం అత్తపెట్టిన ఆరళ్ళకు తగిన శిక్ష అని అనుకుంది. ప్రేమతో కోడలిని చూడకపోతే వచ్చే అనర్థాలు ఇందులో వర్ణించ బడ్డాయి. సమాజంలో నివసించే ప్రతి అత్త తెలుసుకోవడానికి ఈ కథ దోహదపడుతుంది.

2. *గాడిదగా మారిన అత్త కథ :-*

ఓ వూళ్ళో వో కాపామె వుంది. ఆమె భర్త కాలం జేస్తాడు. ఆమెకో కొడుకుంటాడు. ఆమె ముసల్ది. పక్క ఊర్లో ఉండే మరో కాపు పిల్లతో కొడుకు పెండ్లి చేస్తుంది. కోడలు అత్తగారింటికి వచ్చిన తరువాత కోడలు అత్తని ఎలాగైనా ఇంట్లోంచి పంపేయాలని అనుకుంటుంది. తల్లితో కలిసి, ఒక నిర్ణయానికి వచ్చి భర్తని పిల్చి మీ అమ్మ ముసల్ది. తిండైతే బాగా తింటుంది. పని ఏమీ చేయడం లేదు. మీ అమ్మని ఎలాగైనా ఇంట్లోంచి పంపేయి. లేకపోతే నేను నా తల్లి ఇంట్లోకి వెళ్ళిపోతానని అంటుంది. ఆ మాటలకు బాధపడ్డ కొడుకు అన్ని విషయాలు తల్లికి చెప్తాడు. బుద్ధిమంతురాలయిన అతని తల్లి కొడుకుతో నన్ను తీసుకొని అడవిలో వదిలితే అక్కడే ఉంటానంటుంది. ఒక బావి దగ్గర ఓ గుడిసె వేస్తాడు. తల్లికి కావలసిన బియ్యం, పప్పులు కూడా తీసుకుని వెళ్తాడు. ఊర్లోకొచ్చి తల్లిని అడవిలో వదిలేసానని అంటాడు. ఆ మాటకు కోడలు, కోడలు తల్లి సంతోషిస్తారు. కొడుకును కోడలు, కోడలు తల్లి సరిగ్గా చూడరు. అయినా సర్దుకు పోతాడు. అగ్గిదేవుడు, వానదేవుడు, గాలిదేవుడు, వీరి ముగ్గురిమధ్య యుద్ధం జరుగుతుంది. వారిలో వారికి గొప్ప ఎవరు? అనే అంశంపై తిరుగుతూ వస్తున్న వారికి అడవిలో ఈ ముసలమ్మ కన్పిస్తోంది. ఆమెను అడుగుతారు. అప్పుడు ఆ ముసలమ్మ మీ ముగ్గురు ఈ ప్రపంచానికి ఎంతో ముఖ్యం అని సమాధానం చెప్తుంది. ఆ సమాధానానికి సంతోషపడి అవ్వా, నీ వెప్పటికీ పన్నెండెళ్ళ పిల్లలా ఉండు అని దీవిస్తారు.

తిరిగొచ్చిన కొడుకు తల్లి పన్నెండేళ్ళ పిల్లలా తయారయిందని చెప్తాడు. కోడలు తన తల్లి కూడా పన్నెండేళ్ళ పిల్లలా మారితే బావుంటుందని అనుకుంటుంది. అత్తను తీసుకుని అడవిలో వదిలి రమ్మంటుంది కోడలు. వదిలి వచ్చేస్తాడు అల్లుడు. మరల ఈ ముగ్గురు దేవతలు ఈమెను అదే ప్రశ్న వేస్తారు. ఆమె సమాధానం వారికి కోపాన్ని తెప్పిస్తుంది. గాడిదగా మారమని శాపమిస్తారు. గాడిదగా మారిన అత్తగార్ని ఆ కాపువాడు గుమ్మానికి కట్టేస్తాడు. కాపుల ఇంట్లో గాడిద ఉండకూడదని నలుగురి మాటలువిని, గాడిదను 5 రూ॥లకు చాకలి వాడికి అమ్మేస్తాడు. ఈ కథ సత్య, ధర్మ మార్గాలలో నడిచేవారికి ఎప్పటికైనా మంచి జరుగుతుందని కాపోని పిల్లగాడి తల్లివల్ల తెలుస్తుంది.

అసత్య పథంలో నడిచేవారికి అధోగతి తప్పదని ఆశకు లోనైన కోడలు తన తల్లిని అడవిలో వదిలి రమ్మని భర్తని ఒప్పించి పంపుతుంది. తన తల్లి అత్తగారిలా 12 ఏండ్ల పిల్లలా మారుతుందని భావిస్తుంది. కాని చివరకు గాడిదలా మారడం మనకు కన్పిస్తోంది. ఈ కథలో పిల్లగాడి సద్గుణం మాతృప్రేమ కన్పిస్తోంది. కథలో కొన్ని అద్భుత విషయాలున్నప్పటికి మంచిని చెప్పేటప్పుడు కొన్ని అద్భుత విషయాలను జోడించవలసి ఉంటుంది. ఈ కథలో ఒక అత్త పాత్ర ద్వారా స్త్రీ ఔన్నత్యాన్ని జోడిస్తే మరొక అత్త పాత్ర ద్వారా దురాశ స్త్రీకి తగదనే విషయాన్ని స్పష్టం చేయడమైంది.

### 3. అత్తగారి బొమ్మ :-

ఒక ఊరిలో తల్లీ, కొడుకులు ఉన్నారు. కొడుకు పెద్దవాడు అవడంతో టౌను ప్రక్క వూరి అమ్మాయిని తీసుకువచ్చి పెళ్ళి చేసింది. అత్త అనుమతి లేనిదే ఏ పనీ చేయదు కోడలు. ఆ ప్రతిపనికి అత్తగారి సలహా తీసుకుని ఎంతో వినయవతిగా ఉంటుంది. ఒకరోజు అకస్మాత్తుగా అత్త మరణిస్తుంది. అత్త లేక ఒంటరిగా కాలం గడపలేక, కోడలు భర్తతో చెప్పుకుంది. భర్త ఒక కొయ్యతో తయారుచేసిన బొమ్మను భార్యకు ఇస్తాడు. దీనినే అత్తగా అనుకోమని అంటాడు. కోడలు చాలా సంతోషిస్తుంది. కోడలు ఒకమారు ప్రక్కఊర్లో సంతకు వెళుతూ, సంతకు వెళ్ళి వద్దాము అత్తా అని అడిగింది. బొమ్మ నుంచి ఏమీ సమాధానం రాకపోవడంతో ఇంట్లో బొమ్మ అత్తగార్ని విడిచి వెళ్ళలేక అత్తగారి బొమ్మను ఎత్తుకుని సంతకు వెళ్ళింది. సంత ఊరి ముందలనే హనుమంతుని దేవాలయం ఉంది. అత్తగారి బొమ్మను ఆ దేవాలయం దగ్గర పెట్టి సంతకు వెళ్ళి సామాన్లు కొనుక్కొని వచ్చింది. దేవాలయం దగ్గర ఉన్న బొమ్మను అటూ ఇటూ పోతున్న జనం యేదో దేవతా విగ్రహం అనుకుని కానుకలు వేయసాగారు. తిరిగి వచ్చిన కోడలు అత్తగారి ముందున్న డబ్బు, బియ్యం చూసి సంతోషించి అత్తగారి బొమ్మను తీసుకుని ప్రయాణం అయ్యింది.

మరునాడు ఈ సమాచారం ఊరంతా పాకింది - కొయ్య అత్తగారు సంతకు వెళ్ళి చిల్లర, గోధుమలు డబ్బు సంపాదించి వచ్చిందని.

మరల మరోసారి కోడలు సంతకు వెళ్ళి రాత్రి కావడంతో దేవాలయంలోనే బస చేయాలని అనుకుంది. ఆ రాత్రి కొందరు దొంగలు తాము దోచుకున్న ధనాన్ని దేవాలయంలో పంచుకోవడానికి వచ్చారు. దొంగలను చూసిన కోడలు భయపడి, అయ్యో అత్తా అని ఆక్రోశించింది. ఎదురుగా నిలువెత్తు అత్తగారి బొమ్మ అది మంత్రించిన బొమ్మ ఏమోనని దొంగలు భయపడి వాటాలో కొంత డబ్బు తీసి బొమ్మ ముందు ఉంచి వెళ్ళిపోయారు. ఇంటికి వచ్చిన కోడలు జరిగిన విషయాన్ని భర్తకు చెప్పింది. ఊరిలో ఈ విషయం విన్న పొరుగింటి కోడలు తన భర్తను అలాంటి బొమ్మను తయారు జేసి ఇమ్మని అడిగి ఆ బొమ్మను తీసుకొని సంతకు వెళ్ళి ఆ రాత్రి ఒక చెట్టుమీద కూర్చుంది. అదే చెట్టు కింద కూర్చున్న దొంగలనుచూసి. ఆమె భయంతో చేతిలో ఉన్న ఆ బొమ్మను జారవిడిచింది. ఆ బొమ్మను చూసిన దొంగలు కోపంతో చెట్టుమీది కోడలిని బరబర కిందికి లాగి సంతలో ఆమెకొన్న వస్తువులను దొచుకున్నారు.

ఈ కథలో ఒక కోడలు అత్తగారి పట్ల ప్రేమను ప్రకటిస్తే మరొక కోడలు దురాశతో డబ్బు సంపాదించాలనుకొని దురాశపడి అన్నీ పోగొట్టుకుంటుంది. ఎత్తుకు పైఎత్తు, ఇల్లరికం అల్లుడు వంటి కథల్లో అత్తపాత్రలో స్త్రీ మనకు స్పష్టం అవుతుంది. ముఖ్యంగా అత్త పాత్రలోని జానపద స్త్రీ మనస్తత్వాన్ని ప్రతిబింబించే కథలు ఇవి.

## I. జానపద కథల్లో కోడలు :

జానపద కథల్లో కోడలి పాత్రలో స్త్రీ స్థానాన్ని గమనిద్దాం.

### 1. తెలివయిన కోడలు :-

ఆ తండ్రికి ఒక్కడే కొడుకు. పొరుగూరు మంచిపిల్లను తెచ్చి పెండ్లి చేశాడు. అయినా ఆ తండ్రికి మనశ్శాంతి చిక్కలేదు. ఈ కోడలు తన కొడుకును సరిగ్గా చూడడం లేదని భావించి, పరీక్ష పెట్టాడు. ఆ పరీక్షలో కోడలు ఓడిపోతుంది. కోడలిని పుట్టింటికి పంపిస్తాడు. ఇప్పుడు తండ్రి, కొడుకే మిగిలారు. ఈ నువ్వుల మూట తీసుకొనివెళ్ళి అక్కడ సంతలో అమ్మిరా అంటే ఏ ధరకు అమ్మాలి అని కొడుకు అంటే ఏ కొలతతో నువ్వులు తీసుకుంటే అదే కొలతతో నూనె యివ్వాలి. అంటే సరికి సరి అన్నమాట అంటాడు. తండ్రి మాటలు విన్నకొడుకు సంతకు వెళ్ళి నువ్వులు అమ్మడానికి కూర్చుంటాడు. ఓ తెలివైన అమ్మాయి బండెడి నువ్వులను ఒక వీసెడు నూనె వచ్చేలా కొలిచి ఇస్తుంది. ఆమె తెలివికి సంతోషించి అమ్మాయిని కోడలుగా తెచ్చుకుంటాడు. కోడలు వచ్చిన తర్వాత కొడుక్కి శనగల వ్యాపారం అప్పజెప్పాడు. కాని కొడుకు ఒక

స్త్రీకి జూదం ఆటలో ఓడిపోయి బానిసగా ఉంటాడు. ఈ విషయం తెలుసుకున్న కోడలు మగవాడి వేషంలో ఆ స్త్రీ ఇంటికివెళ్ళి తాను పందెం కాస్తున్నదని చెప్పి కబురు పంపుతుంది. ఆట మంచి పట్టులో ఉండగా వేషధారి అయిన కోడలు తన చొక్కా జేబులోంచి రెండు ఎలుకపిల్లలను మూడోకంటికి తెలియకుండా వదిలింది. ఎలుకను చూసిన పిల్లి వెంట పరుగుపెట్టింది. దీపం ఆరిపోయింది. ఆ స్త్రీ. ఓడిపోయింది. ఓడిపోయినందుకు ఆ స్త్రీ తన దగ్గర బందీలుగా వున్న వారందరిని విడిచిపెట్టింది. అందులో తన భర్త ఉండడం గమనించి వారిని తీసుకొని వెళ్ళుతుంది. తెలివయిన స్త్రీ తన కుటుంబాన్ని ఏ విధంగా చక్కదిద్దుకొనే ఓర్పు నేర్పు అవసరమైతే భర్తకోసం కుటుంబం కోసం ధైర్యసాహసాలను ప్రదర్శించ గలదనే విషయాన్ని ఈ కథలోని జానపద స్త్రీ నిరూపించింది.

తన కొడుకు జీవితం కోడలు తెలివితేటలతో హాయిగా గడచిపోతుందని తీర్మానించుకొని ఆ బాధ్యతలనన్నింటిని కోడలికి అప్పగిస్తాడు. ఈ కథలోని మామ పాత్రధారి. జానపదస్త్రీ చదువులేకపోయినా కుటుంబాన్ని చక్కదిద్దుకునే నేర్పు అవసరమయితే, భర్తకోసం కుటుంబం కోసం ధైర్యసాహసాలను ప్రదర్శించే వీరవనితగా కూడా ఋజువు చేసుకుంటుంది.

2. *కోడలికేమి అధికారం? :-*

పైట చెరుగు వెనుక చేయి దాచుకుని వస్తున్న నీలమ్మను రోడ్డుమీద చూసి సంగమ్మ ఎక్కడి నుండి వస్తున్నావని అడుగుతుంది. దానికి నీలమ్మ మీ ఇంటి నుండి వస్తున్నాను కాస్త మజ్జిగ దొరుకుతుందేమోనని వెళ్ళాను అంది. ఏమయింది మజ్జిగ యింకా అవలేదట. మీ కోడలు నాతో అంది. అని దీర్ఘం తీసిన నీలమ్మతో. సంగమ్మ ఆమెకేం అధికారం వుంది అలా చెప్పడానికి? నాతోరా. కనుక్కుందాం అంది.

ఆమె ముందు, నీలమ్మ వెనక తిరిగి ఆమె ఇంటిదాకా నడిచారు. పది అడుగుల్లో యిల్లు వచ్చింది. సంగమ్మ వడివడిగా అడుగులు వేసుకుంటూ లోపలకు వెళ్ళింది. నీలమ్మ వరండా మెట్ల దగ్గరే ఆగిపోయింది.

రా-మజ్జిగ తీసుకు వెళ్ళటానికి యేం తెచ్చావు? అని అడిగి ఆమె చేతిలోని గిన్నె అందుకుని వంట గదిలోకి వెళ్ళింది సంగమ్మ. కాస్సేపట్లో సంగమ్మరానే వచ్చింది. నీ కడుపు చల్లగా పది కాలాలపాటు వర్ధిల్లు అని దీవెన నీలమ్మ నోటివెంట యింకా పూర్తిగా రాకముందే సంగమ్మ ఇదుగో అవ్వా, ఇంకా మజ్జిగ అవలేదు అంటూ ఆమె గిన్నె ఆమె చేతిలో పెట్టేసింది. అయ్యో అయ్యో ఇందాకటిమాటే రూఢి అయింది గదా! అనుకుంటూ నీలమ్మ తన యింటికి నడిచింది.

మజ్జిగ అవలేదు అని చెప్పడానికి కోడలుకు యేం అధికారం వున్నది. ఈ మాట చెప్పవలసింది నేను కదా. అని అత్తగారు వాపోతుంది. ఈ కథ వాస్తవిక కథగా భావించవచ్చు. ప్రతి అత్తాకోడళ్ళ మధ్య జరిగే విషయాలకు ఈ కథ ప్రతీకగా ఉంది. అత్త పెత్తనం కొనసాగనివ్వని కోడలిపాత్రలో జానపద స్త్రీ కన్పిస్తోంది.

3. *చేసిందొకటి అయిందింకొకటి :*

ఒక వూరిలో ఒక తల్లి కొడుకు వుంటారు. కొడుక్కి పెళ్ళిచేసి కోడలిని తీసుకొస్తుంది. కాపురానికి వచ్చిన దగ్గరనుంచి కోడలు అత్తతో గొడవ పడ్తూ ఉంటుంది. భర్త సాయంతో అత్తని తొలగించుకుందామనుకుంటుంది కోడలు. అదే సమయానికి కోడలు తల్లి కూతుర్ని చూడడానికి వస్తుంది. భోజనాలు చేసిన తర్వాత పడుకుంటారు. అత్త కోడలి దుర్బుద్ధిని గమనిస్తూ ఉంటూంది. అత్తగారు నిద్రపోయిన తర్వాత అత్తగారికాలికి కంబళి కట్టి పెడుతుంది. ఇది గమనించిన అత్త తనకాలికి కట్టిన కంబళిని విప్పుకుని తన వియ్యపురాలి కాలికి కడుతుంది. అది గమనించని అల్లుడు భార్యమాట ప్రకారం కంబళి చుట్టేసి ఆమెను మోసుకుంటూ ఊరిచివర గల చెరువలో పడేస్తాడు. కోడలు పీడ విరగడయింది అని సంతోషిస్తూ ఇంటికి వస్తారు. కసువు వూడుస్తు అత్తగారు కన్పిస్తుంది. అమ్మని కాలువలో పడేసానని అనుకుంటున్న కొడుకు నిజంగా అత్తగారిని పడేసాడని తెలుసుకోలేకపోవడం ఆశ్చర్యం కల్గిస్తుంది. ఇది ఎలా జరిగిందో అతనికి అర్థం కాదు.

ఆ కథలో స్త్రీ అసూయతో అత్తగార్ని తుదముట్టించాలనుకుంటే తన తల్లికే ఆ దుర్గతి పడుతుందనీ నిజాన్ని గ్రహించడానికి, ఇటువంటి కథలు ఊపయోగపడతాయి. స్త్రీకి సహజమైన కోపం. అసూయలవల్ల నిండు జీవితాలకు ముప్పు కల్గుతుందనే నీతిని కూడా ఈ కథ తెలియజేస్తోంది. అత్తపాత్రలో ఉన్న జానపద స్త్రీ లౌక్యం, సమయ స్ఫూర్తి, తెలివితేటలు తేటతెల్లమవుతున్నాయి.

4. ఎత్తుకు పై ఎత్తు :-

అత్తగారు కోడలిని చంపాలని నిర్ణయించుకుంది. కొడుకుతో చెప్తుంది. దానికి అంగీకరించిన కొడుకు నీవే యేదో చెయ్యి అన్నాడు.

అత్త కడుపుమండిపోతుంది. కోడలిపై కోపంతో ఉడికింది. దీనిని సజీవంగా దహనం చేసిపారేయాలి అని తీర్మానించుకుంది. కొడుకు అందుకు అంగీకరించాడు.

శ్మశానంలో కోడలిని పడుకోబెట్టి కట్టెలు పేర్చి, నిప్పు అంటించాలని అనుకుంటుంది. కాని అగ్గిపెట్టె మరచి ఇంటిదాకా వెళుతుంది. కొడుకు భార్యపై జాలి,

కరుణ కలిగి ఆమెను కాపాడాలనే ఉద్దేశంతో కట్లు విప్పి యివతలకు తీసి బండరాయి పెట్టి గుర్తు తెలియకుండా గుడ్డలు కప్పి మళ్ళీ కట్లు బిగించాడు. ఏదయినా చెట్టు ఎక్కి కూర్చోమని భార్యకు సలహా ఇస్తాడు. తల్లి అగ్గిపెట్టె తీసుకురాగానే కట్టెలకు మంట అంటించి తల్లి కొడుకు యింటికి వెళ్ళారు. ఇలా వుండగా రాత్రి ఊరు దోచుకున్న దొంగలు కోడలు ఎక్కికూర్చున్న చెట్టుకిందికి చేరి తాము దోపిడిచేసుకువచ్చిన ఐశ్వర్యం అంతా పంచుకుంటున్నారు. పైన కన్పించిన ఆకారం చప్పుడు చేస్తూ ఉండడం గమనించి పిశాచిగా భావించి పారిపోతారు. చెట్టు దిగిన కోడలు డబ్బును బంగారాన్ని మూటకట్టుకుని కిందికి వచ్చి అత్తా తలుపు తెరువు అని పిలుస్తుంది. గుమ్మంలో నిల్చున్న కోడలిని చూసి భయపడుతుంది.

ఆలస్యం అయిపోయింది అత్తా. ఆ లోకంలో ఉన్న మామగారు డబ్బు దస్కం వెండి, బంగారు యిచ్చి పంపారు. వీధిలో వాళ్ళంతా చూస్తే యింకేమయిన ఉందా? అత్తా! మీరేం భయపడకుండా తలుపు తెరవండి.. అంది కోడలు., అత్త మెల్లిగా తలుపు తెరిచి చూచింది. వచ్చింది కోడలే! సందేహం లేదు. పిశాచి కాదు. లోపలికి రానిచ్చి నెత్తిమీద మూట దింపుకుంది. ఆ మూటలో వెండి బంగారము విలువల గల వస్తువులన్ని ఉన్నాయి. నన్ను మీరు దహనం చేసి యింటికి వచ్చేశారు కదా. నేను పై లోకానికి వెళ్ళాను అక్కడ మామగారు కలిశారు. ఇవన్ని ఇచ్చి అయిపోయిన తర్వాత తిరిగివస్తే యింకా యిస్తానన్నాడు అంది. ఆ మాటలకు అత్త ఈ మారు నేను వెడతాను. ఇవన్ని అయిపోయిన తర్వాత కాదు. వెళ్తున్నానిప్పుడే. వెళ్ళి తెచ్చుకుంటే సరిపోతుంది అని భావించి అత్త కోడలిని పిలిచి బండిలో కట్టెలన్ని పేర్చిసిద్దం చేయి అంది. అత్త తనంతట తానే కట్టెలపై కూర్చుని నిప్పు అంటించుకుంది. ఆ మంటలకు తగలబడి పోయింది.

అత్త దురాశే చివరకు మరణానికి దారి తీసిందనేది స్పష్టం.

## II. జానపద కథలో స్త్రీ :-

నేటి ఆధునిక సమాజంలో, హైటెక్ నాగరికతలో స్త్రీలు అన్ని రంగాలలో అభివృద్ధి సాధించినా చట్ట సభల్లో అధికారాన్ని చెలాయించినా స్త్రీలు వరకట్నచావులకు ఆత్మహత్యలకు బలి అవుతున్నారు. దానికి కారణం స్త్రీకి స్త్రీయే శత్రువుగా భావించు కోవడం, స్త్రీని తోటి స్త్రీ గౌరవించలేకపోవడమే. ఈ దేశంలో ఆడదానిగా పుట్టడం శాపంగా భావించే తల్లిదండ్రులుండడం మరో ప్రముఖమైన కారణం. తల్లి తన కడుపున పుట్టిన ఆడపిల్లను ఈసడించుకోవడం, కొడుకు పట్ల ఒక ధర్మం, కూతురు పట్ల మరో ధర్మాన్ని కలిగి ఉండడం ఆడపిల్ల పుడితే అరిష్టం అని భావించే ఈ సమాజంలో స్త్రీని గౌరవిస్తున్నట్టు కన్పిస్తున్న స్త్రీని అగౌరవపరిచేస్థితి అన్నిచోట్ల ప్రత్యక్షంగా కనిపించడం

శోచనీయమైన విషయం. ముఖ్యంగా ఈనాటి సమాజంలో స్త్రీ స్థానం ఇంకా ఇలాగే ఉంటే ఆనాటి జానపదకథల్లో స్త్రీ స్థితి కూడా ఇంచుమించు ఇలాగే ఉన్నట్లు కొన్ని కథల వల్ల అర్థం అవుతుంది. కల్పిత కథలని మనం అంటున్న ఆనాటి కథల్లో స్త్రీపట్ల ఉన్న అధికారాలు స్పష్టంగా వెల్లడి అవుతున్నాయి. అందుకు నిదర్శనంగా ఉన్న కథలను పరిశీలిద్దాం. అయ్యో ఆడపిల్ల పుట్టిందంటే అరిష్టంగా భావించే కథల్లో మైనావతి, అభేద నలుగురు ఆడపిల్లలు, పతివ్రత సంగమ్మ, దొంగ కూతురు వంటివి పేర్కొనవచ్చు.

**అభేద :-**

తల్లి దండ్రులకు యిద్దరు పిల్లలు ఒక అబ్బాయి ఒక అమ్మాయి. మతం, భక్తి, విశ్వాసం, నమ్మకాలు ఆనాటి సమాజంలో ఎక్కువగా ఉండడం వల్ల జానపదులు వీటి బలహీనతకు లొంగి జీవించేవారు. మానవాతీత శక్తులున్నాయని నమ్మేవారు మూఢనమ్మకాలు సంప్రదాయాలపట్ల విశ్వాసాన్ని ప్రకటిస్తూ జీవించేవారు. ఏకైక కుమార్తె పుట్టడం వల్ల నష్టం ఉందని చెప్పగానే తల్లిదండ్రులు అభేదను విడిచి వెళ్ళిపోతారు. 12 సంవత్సరాలు పెరిగిన అభేద పూజా పునస్కారాలతో భజనలు చేస్తూ పెరుగుతుంది. అ జంగం అభేద వ్యవహారం బాగా లేదని తల్లిదండ్రులకు కబురు చేస్తాడు. అభేద అన్న వచ్చాడని తెలిసి తలుపుతీస్తుంది. ఆమెను నమ్మించి అరణ్యానికి తీసుకొని వస్తాడు. అభేదను నరికే ప్రయత్నం చేస్తాడు. కాని అది అతని వల్లకాదు. ఆమెను ఆ చెట్టు కింద వదిలేసి వెళ్ళి పోతాడు. ఆ చెట్టు దగ్గిరే కూర్చుని పూజలు చేసుకుంటున్న అభేద చుట్టు పుట్ట బయలుదేరుతుంది. అటుగా వస్తున్న రాజు ఈ భజన చేస్తున్న వాళ్ళెవరో చూద్దామని ఆ చెట్టు దగ్గరకు వస్తాడు. పుట్టను తవ్విస్తాడు. అందమైన అభేద రూపాన్ని చూసి వివాహం చేసుకుంటాడు. తల్లిదండ్రులు విడిచినా ఆమె అదృష్ట జాతకురాలు కాబట్టి చివరకు రాజు వివాహం చేసుకుంటాడు.

**భార్యను కొట్టనున్న రాజు :-**

ఒక రాజు ఒక అమ్మాయి తెలివి తేటలను గమనించి ఆమెకొక పరీక్ష పెడతాడు. రాజు ఆ అమ్మాయిని వివాహం చేసుకుంటాడు. మేం వచ్చేసరికి పన్నెండు మెట్లున్న సొరంగం, బావి తయారు చెయ్యాలి. కొత్తిమీర, మెంతులు తోట వేయాలి. నీ మెడలో ఒక మల్లె పూల మాల వేస్తున్నాను అది వాడిపోకూడదు. నేను వచ్చేటప్పటికి ఒక కుర్రవాడిని కని ఉండాలి అని అంటాడు. ఆ యువతి అందుకు సరేనని అంటుంది.

సొరంగం బావి త్రవ్వించి తోట వేయించింది. మగవేషంలో బయలుదేరింది. ఆమె అలా ప్రయాణం చేస్తుంటే ఒక ప్రకటన విని, రాకుమారి పంతం తెలుసుకొని ఆ పందానికి సిద్ధపడుతుంది. ప్రవహించే నీటి మీద గుర్రాన్ని నడిపిస్తుంది. ఆ పందెంలో

గెలిచినందుకు ఆ అమ్మాయిని కత్తికి భాష్యం కట్టి వచ్చేస్తుంది. వేట జరుగుతున్న ప్రాంతానికి వెళ్ళి అక్కడ నాట్యంచేసి రాజుతో రెండు రోజులు గడుపుతుంది. అతని ఆనవాలుగా ఉంగరం, శాలువ తీసుకుని తిరిగి వచ్చేస్తుంది. రాజు వచ్చి చూస్తాడు. మెడలోని మల్లెమాల వాడలేదు. సొరంగం త్రవ్వి ఉంది. పంట పండించింది. ఇదిగో మీ బిడ్డ అని ఇస్తుంది. దానికి ఆశ్చర్యపడి, రాజు భార్యను కొట్టవచ్చని అనుకుంటాడు. వెంటనే ఉంగరాన్ని, శాలువాని తెస్తుంది. రాజు ఆమె తెలివితేటలకు ఆనంద పడతాడు. ఈ కథను బట్టి చూస్తే జానపద స్త్రీ తెలివైనదని, అనుకున్న కార్యక్రమాలను నిర్వహించ గలిగిన నిపుణత ఆమెకు ఉన్నాయని, అవసరమైతే ధైర్య సాహసాలు కూడా ప్రదర్శించ గలదని తెలుస్తోంది.

*నలుగురు ఆడపిల్లలు :-*

ఒక రాజుకి నలుగురు ఆడపిల్లలు. ముగ్గురు అక్కలు చేసిన పనికి బాధపడ్తూ తాను ప్రేమించిన వ్యక్తిని పెండ్లి చేసుకోవాలనే కోరికతో ఎన్నో కష్టాలు పడ్డ స్త్రీ కథ.

పతివ్రత సంగమ్మ, నేరేడు మొక్క, మారుటి కూతురి కథ, పేదరాశి పెద్దమ్మ వదినల ఆగడం వంటి కథల్లో స్త్రీ యొక్క భిన్నరూపాలు మనం గమనించవచ్చు.

స్త్రీ స్థితిగతులకు స్త్రీకి ప్రాధాన్యత నివ్వడం కనిపిస్తోంది. మరికొన్ని కథల్లో స్త్రీని తక్కువగా చూడడం కనిపిస్తోంది. జానపద కథల్లో స్త్రీ చదువు లేకపోయినా తనకున్న అవగాహన శక్తితో ఆనాటి సమాజాన్ని అర్థం చేసుకొన్న జానపద స్త్రీలు తమ అనుభవాలను, పాటల రూపంలో వినిపిస్తూ కథల రూపంలో చెప్పుకున్నారు. ముఖ్యంగా జానపద స్త్రీకి మతాచారాల పట్ల విశ్వాసం నమ్మకం ఎక్కువగా ఉండడం, గ్రామదేవతారాధన, మూఢ విశ్వాసాలపట్ల సంప్రదాయాల పట్ల, మక్కువ ఎక్కువ. ఉదా.- పతివ్రత సంగమ్మ కథను తీసుకోవచ్చు.

అంతేకాకుండా పైన పేర్కొన్న వాటిని సక్రమంగా నిర్వహించనిచో తమకు అరిష్టం జరుగుతుందనే భయం ఉండడం వల్ల నేరేడు మొక్క, మారుటి కూతురి కథ, పద్మావతి కథలను గమనిస్తే స్త్రీ జానపద కథల్లో అప్పటి కప్పుడు తటస్థ పడే సమస్యలను తప్పించుకొనే లౌక్యంతో పాటు, ఎంతో సహనాన్ని శక్తిని కలిగి ఉండేది. వీరత్వానికి ప్రతీకగా కన్పించే కొన్ని కథలు అనుమతించిన తప్ప జానపదులు చెప్పుకుంటున్న కథలు పాటలను పరిశీలిస్తే జీవన విధానంలో పురుషులకు ఉన్న స్థానం కంటే తక్కువేనని భావించవచ్చు.

- జానపద సాహిత్య జాతీయ సదస్సు *OU*లో సమర్పించిన పత్రం-నవంబర్ - 2000

